కీర్తిశేషుడు

# భూలాభాయి దేశాయి

గ్రంథకర్త:

గోపరాజు వెంకటానందం.



పబ్లిషరు:

శ్రీసత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్

రాజమండ్రి

1946

కాటు] [వెల రు 0-8-0

# అంకితం

## అజాద్ హింద్ ఫౌజు వీరులకు

రాజమహేంద్రవరమున
శ్రీ వేణు ఆర్టు ప్రింటింగు వర్క్సునందు
ముద్రింపఁబడియె.

ఈగ్రంథ రచనకు తోడ్పడిన పత్రికలు.

ఆంధ్రపత్రిక.

ఆంధ్రప్రభ.

కృష్ణాపత్రిక.

జన్మభూమి.

# గ్రంథకర్త

శ్రీగోపరాజు వెంకటానందంగారి జననం ది 19-2-1919. స్వగ్రామం నిడదవోలు. ఉత్సాహముగల యువకులు. వీరు గ్రంథాలయోద్యమంలో రెండుసంవత్సరాలు, హరిజనోద్యమంలో సుమారు ఆరుసంవత్సరాలు పనిచేశారు. నిడదవోలులో పట్టణ యువజన సంఘమును స్థాపించి, దానికి చాలకాలము కార్యదర్శిగా పనిచేసిరి. యువజన సంఘం తరఫున "యువజన" అను వ్రాతమాసపత్రికను పెట్టి చాలకాలము దానికి సంపాదకులుగా నుండిరి.

వీరు పత్రికలద్వారా ఆంధ్రలోకానికి చిరపరిచయులే. ఆంధ్రదేశములోని సుప్రసిద్ధ పత్రికారచయితలతో సహోద్యోగి. ప్రస్తుతం ఆంధ్రప్రభ. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికాసిబ్బందులు. పత్రికారచయిత హోదాలో వీరు అనేకమంది అఖిల భారతనాయకులతో యింటర్వ్యూలు జరిపారు వీరు యిదివరలో చాలగ్రంథములు రచించి ఆంధ్రలోకాని కర్పించారు. వీరువ్రాసిన "ప్రపంచవీరులు" కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో మెట్రిక్యులేషను పరీక్షకు రెండుసంవత్సరాలు పాఠ్యగ్రంథంగా పెట్టారు. వీరురచించిన గాంధీమహాత్ముని జీవితం డాక్టరు పట్టాభివంటి ప్రముఖుల మన్ననలను పొందింది. సామ్యవాద భావాలుగల చక్కని రచయిత.

"పబ్లిషర్సు"

# ముందుమాట.

---

స్వాతంత్ర్యయుద్ధానికి ఆయుధంచేబట్టి యుద్ధంచేయు సైనికు లెంత అవసరమో, ఆ సైనికులకు మందుగుండుసామానును తయారుచేసి యిచ్చేవారు, ఆహారపదార్థాలు తయారుచేసియిచ్చేవారు కూడా అంతేఅవసరం. ఇరువురుచేసేది దేశసేవయే.

ఆవిధంగానే స్వాతంత్ర్య యోధులలో, ఉరికంబాలెక్కేవారు, జైళ్ళకువెళ్ళేవారు కొందరుంటే, తమరచనలద్వారా ప్రజలను స్వాతంత్ర్యరంగానికి ఉద్రేకపరిచే రచయితలు, వైద్య సహాయముచేసే డాక్టర్లు, న్యాయస్థానాలలో స్వాతంత్ర్యయోధుల సేవనుఉగ్గడిస్తూ వారికొరకు పోరాడేన్యాయవాదులు కొందరున్నారు.

అలాంటి స్వాతంత్ర్య యోధుడైన న్యాయవాది బూలాభాయి జీవాంజీ దేశాయి జీవితం యిది.

---

శ్రీ

# భూలాభాయి దేశాయి

ఆతడొక సుప్రసిద్ధ న్యాయవాది.—రాజకీయవేత్త—దేశభక్తుడు—సత్యాగ్రహి—శాసనసభానాయకుడు.—హిందూముస్లింసఖ్యతాసంధాత. ఆతడే భూలాభాయి దేశాయి.

ఈ దేశాయి కొరకే నేడు భారత ప్రజాకోటి అంతా పరితపిస్తున్నది. ఈన్యాయవాదికొరకే భారతరాజకీయ ఖైదీలంతా తమ అండపోయిందని విచారిస్తున్నారు. ఈరాజకీయ నేత్త కొరకే, తమకు రాజకీయశాస్త్రములోని సలహాలనిచ్చే సలహాదారుడు చేజారిపోయినాడని రాజకీయవేత్తలంతా నిస్పృహులైనారు. శాసనసభా మర్యాదలునేర్పే ఒకమహావ్యక్తి లేకపోయాడేయని శాసనసభికులంతా కండ్లనీరు పెట్టింది ఈదేశాయికొరకే. దేశం చాలాక్లిష్టసమయంలో మంచిమేధావియైన ఒక గొప్పనాయకుని కోల్పోయిందని ప్రతివారు వగచింది ఈభూలాభాయికొరకే.

అయితే. ఒక వ్యక్తికొరకు దేశంలోని యింతమంది దుఃఖిస్తూ యున్నసమయంలో, భారతప్రజలను పరిపాలించే పరప్రభుత్వం బహుశాయన "ప్రతిపక్ష భయంకరుడు" చల్లగా జారిపోయాడు అనే చంకలు కొట్టుకోవచ్చు. ఈతనివాగ్ధాటి ముందు నిల్వలేక, శాసనసభలో ఈన్యాయవాది వేసేప్రశ్నకు

సమాధానమేమివ్వాలో తెలియక, తెల్లబోతూ నిలబడే ప్రభుత్వసభ్యులు "భళీ" యని సంతోషించవచ్చు. కాని భారత దేశం మాత్రము ఈవ్యక్తిని ఎన్నటికీ మరచిపోలేదు.

## జననం.

ఆయన పూర్తిపేరు భూలాభాయి జీవంజీదేశాయి. భూలాభాయి దేశాయి 1877 సంవత్సరం అక్టోబరు 13 వతేదీని సూరతుజిల్లాలోని బల్సారు గ్రామంలో ఒక గౌరవ కుటుంబమున జన్మించెను. బల్సారు గ్రామం బార్డోలీ సమీపంలోనే యుంది చరిత్రాత్మకమైన సత్యాగ్రహంద్వారా బార్డోలీ భారతదేశమందేగాక ప్రపంచమంతటా ప్రఖ్యాతిబడసింది. భూలాభాయి కుటుంబమే అసలు న్యాయవాదుల కుటుంబము. ఈతని తండ్రి గవర్నమెంటుప్లీడరు. వీరు అనవిల్ అనే ఒక గుజరాతు సద్బ్రాహ్మణ వంశానికి చెందినవారు.

## విద్యాభ్యాసము.

భూలాభాయి పల్లెటూరి చదువుముగిసినతర్వాత ఉన్నతవిద్యాభ్యాసంకొరకు బొంబాయి ఎలిఫిన్స్టన్ కళాశాలలో జేరి ప్రథమశ్రేణిలో పట్టభద్రుడయ్యెను. ఐ. సి. యస్. పరీక్షకు వెళ్ళినచో ప్రభుత్వమువారు స్కాలరుషిప్పు కూడాయిస్తామన్నారు. కాని కుటుంబపరిస్థితులు అనుకూలంగా లేకపోవుటచే ఆ అవకాశాన్ని నిరాకరించాడు. తర్వాత ఎం. ఏ. పరీక్షప్యా

సయి, కొంతకాలము అహమ్మదాబాదులోని గుజరాతు ఆర్థిక చరిత్రశారీలకుకళాశాలలోని ఆచార్యుడుగా పనిచేసెను.

## ఉ ద్యో గ ం.

అదేమి విచిత్రమోగాని ప్రపంచవిఖ్యాతిబొందిన భారత జాతీయనాయకులలో చాలామంది మొదటిబడిపంతులు ఉద్యోగముచేసినవారే. ఉపాధ్యాయ వృత్తిలోయున్న గొప్ప విశేష మేమంటే ఆవృత్తిలో పనిచేయువారికి గొప్పవాదనాశక్తి మాత్రము పట్టు బడ్తుంది.

ఈ ఉపాధ్యాయ వృత్తిలో భూలాభాయి రెండు సంవత్సరములు పనిచేసెను. బహుశా బూలాభాయికి ఉపాధ్యాయ వృత్తిలో విసువుజనించి దేమో—లేక ఆతనికప్పుడే అంతరాత్మ ప్రబోధమువల్ల తెలిసిందేమో—తనకి ఉద్యోగముశాశ్వతము కాదని. విద్యార్థులకు ఆచార్యత్వము వహించడంకంటె భారత ప్రభుత్వ కీలకస్థానమైన శాసనసభలో శాసనసభ్యులకు ఆచార్యత్వము వహించవలసియుంటుందని దేశాయి ఆనాడు కలగన్నాడేమో. వెంటనే భూలాభాయి ఉపాధ్యాయవృత్తికి స్వస్తి చెప్పి, తనదృష్టిని న్యాయవాదవృత్తికి మరల్చినాడు. దేశాయి ఈలోగా ఎల్. ఎల్. బి. పట్టముకూడా పొందగల్గెను.

## న్యా య వా ద వృ త్తి.

బొంబాయి హైకోర్టులో ఆయన న్యాయవాదిగా ప్రవేశించి, క్రమాభివృద్ధి చెందుతూవచ్చెను. భూలాభాయి బొం

బాయి హైకోర్టులో కాలిడునరికి హైకోర్టంతా బారిస్టర్లతో నిండియుంది. భూలాభాయిమాత్రము స్వచ్ఛమైన స్వదేశీన్యాయవాది. అయినప్పటికీ ఈతనవాదనా శక్తివల్ల ఈతడు బారులో త్వరగానే ప్రఖ్యాతి గడించగలైను. 1923 లో వైస్రాయి కార్యవర్గపదవిని స్వీకరించ వలసినదని ప్రభుత్వము ఈయనను కోరింది. కాని దేశాయిదానిని నిరాకరించెను. అనేకసార్లు హైకోర్టు న్యాయమూర్తి పదవిని కూడాయిస్తామని ప్రభుత్వము దేశాయిని ఆహ్వానించింది. కాని దేశాయి వాటినన్నిటిని కూడా వలదని నిరాకరించెను. పిమ్మట 1926 సంవత్సరములో మాత్రము తాత్కాలికంగా భూలాభాయిదేశాయి అడ్వకేటు జనరలు పదవిని స్వీకరించెను.

హోంరూలు ఉద్యమం.

భూలాభాయిదేశాయి రాజకీయరంగంలో అభ్యుదయాభిప్రాయాలుగల మితవాదిగా ప్రవేశించాడు. ఈతడు మొదట పనిచేసిన ఉద్యమం హోంరూలు ఉద్యమము. ఈ ఉద్యమానికి మూలకర్త్రి డాక్టరు అనిబిసెంటు. కాంగ్రెసులో గాంధీగారి ప్రాబల్యము హెచ్చేవరకు అనగా 1920 వరకు అనిబిసెంటుగారి హోంరూలు [illegible] కార్యక్రమంగా యుండేవి. ప్రజలంతా హోంరూలు ఉద్యమానికి హర్షించారు. దేశంలో చాలమంది నాయకులు ఈ హోంరూలు ఉద్యమాన్ని గ్రామ గ్రామానికి తిరిగి ప్రచారం చేయడం మొదలుపెట్టారు. ఈ హోం

రూలు ఉద్యమసిద్ధాంతాలు ఎక్కువగా స్వపరిపాలనా పద్ధతిపై నాధారపడి యున్నవి.

ఆంగ్లేయుడు తన ఇంగ్లాండు దేశంలో స్వతంత్రతగా యుండగల్గుతున్నాడో, భారత దేశంలో భారతీయులు కూడా అట్లు స్వతంత్రతగా యుండగల్గాలి.

తమప్రజలచే ఎన్నుకోబడిన వారే పాలకులుగా యుండాలి.

తమప్రజలపైనను, తమ దేశముపైనను భారతీయులు సర్వాధికారములు గలిగియుండాలి.

ఇటువంటి సూత్రములపై నాధారపడి యుందీ హోంరూలు ఉద్యమం.

భూలాభాయిదేశాయి మిగిలిన జాతీయ నాయకులతో పాటు తాను కూడా ఈహోంరూలు ఉద్యమంవల్ల ఆకర్షించబడి, అందులోచేరి, ఆఉద్యమాన్ని ఎంతోపరిచారంలోనికి తీసుకొని వచ్చాడు. ఈ సమయంలోనే దేశాయికి గాంధీజీతోను, సర్దార్ వల్లాభాయి పటేలుతోను పరిచయం గల్గింది.

## బార్డోలీ సత్యాగ్రహం

1928 సం॥ లో జరిగిన బార్డోలీ సత్యాగ్రహము చాల చరిత్రాత్మకమైనది. 1928 సంవత్సరమంతా సైమనుకమీషను బహిష్కరణ హడావుడిలో దేశం నిమగ్నమైపోయియుంది. ఆ తెల్లదొర సైమను దేశంలోని ఏమూరుమూలలకువెళ్ళినా నల్లా

జండాల ప్రదర్శనమే. అందుకు ప్రతిగా పోలీసు హడావుడిలు, లాటీచార్జీలు, తుపాకుకాల్పులు జరిగాయి. ప్రభుత్వము ఎన్ని దౌర్జన్యాలు సల్పినా, ప్రజలుమాత్రము 1927 లో మద్రాసులో డాక్టరు అన్సారీగారి అధ్యక్షతను జరిగిన కాంగ్రెసు మహాసభలో తీర్మానించినట్లుగా "సైమనుకమీషను బహిష్కరణోద్యమము" ను అక్షరాలా అమలు జరుపగల్గారు

గుజరాతులో ప్రత్యేకముగా జరిగిన పన్నుల నిరాకరణోద్యమం ఆసంవత్సరంలోనే జరిగింది. 1928 సంవత్సరంలోనే బార్డోలీలో రీసెటిలు మెంటు విషయంలో పన్నుల నిరాకరణబాగుగాసాగింది. ఈపన్నుల నిరాకరణ సంధర్భంలో అప్పుడు జరిగిన ప్రభుత్వ నిరంకుశత్వము వర్ణింపనలవికాదు. తర్వాత 1930 లో గాంధీ—ఇర్విను ఒడంబడిక జరిగింది. తర్వాత గాంధీగారికి లండనులో జరిగే రెండవ రౌండుటేబిలుకాన్ఫరెన్సుకు రావలసినదని ఆహ్వానమువచ్చింది. కాని గాంధీమహాత్ముడు, కొందరు ప్రభుత్వసభ్యులు గాంధీఇర్విను ఒడంబడికకు భంగముకల్గించేనారనే కారణంచేత రెండవరౌండుటేబిలు కాన్ఫరెన్సుకు వెళ్ళనిరాకరించెను. తుదకు బార్డోలీ పన్నుల విషయమై ఒకకోర్టునుపెట్టి విచారించుతామనే వాగ్దానంతో గాంధీగారు లండను వెళ్ళుటకు ఒప్పుకున్నారు. అదే 1931 లో ఏర్పాటైన బార్డోలీ విచారణ సంఘం.

బూలాభాయిదేశాయి 1928 లో బార్డోలీ సత్యాగ్రహమప్పుడు గవర్నమెంటు వారేర్పాటుచేసిన బ్రూంఫీల్డుకమిటీ

ఎదుట రైతుల పక్షమునహాజరై వాదించెను. తర్వాత మరల 1931 లో బార్డోలీ విచారణసంఘంలో కూడా హాజరయ్యెను.

శాసనోల్లంఘనోద్యమం

1932 లో గాంధీమహాత్ముని నాయకత్వమున జరిగిన సత్యాగ్రహోద్యమములో బూలాబాయిదేశాయికూడా పాల్గొనెను. 1932 సం॥ లో జరిగిన ఈ సత్యాగ్రహోద్యమానికి ముఖ్యకారకులు అప్పటిలోవైస్రాయిగా నుంటున్న లార్డు విల్లింగ్డన్ యేఅనిచెప్పాలి.

గాంధీమహాత్ముడు లండనునుండి తిరిగిరాగానే దేశంలో చాలమంది నాయకులను ప్రభుత్వము అరెస్టు చేయసాగింది. జవహర్లాలుగారిని అలహాబాదులో అరెస్టుచేశారు. గఫూర్ ఖాన్ గాంధీగారిని పిషావరులో అరెస్టుచేశారు. కలకత్తాలో ప్రత్యేక ఆర్డినెన్సు ప్రవేశపెట్టారు. దేశమంతా నానాభీభత్సంగానుయుంది. ఇంతలో గాంధీమహాత్ముడు విల్లింగడన్‌గారికి తంతిద్వారా "మీతోమాట్లాడుటకు రావలెననియున్నది. ఏమంటారు" అని తంతినిచ్చారు. అంతట వైస్రాయి వెల్లింగడన్‌గారు, రౌండు టేబిలు సభావిషయాలుతప్ప, మిగతావిషయాలు మాట్లాడుటకు వీలులేదని" జవాబుపంపారు. ఇక కాంగ్రెసుకు వేరే గత్యంతరంలేక స్వాతంత్ర్యపోరాటమునకు దిగవలసివచ్చింది.

ఈఉద్యమంకూడా జయప్రదంగానే కొనసాగిందని చెప్పవచ్చు. ఉద్యమం ప్రారంభంకాగానే, వైస్రాయి ఈఉద్యమాన్ని

ఆరువారాలలో అణగద్రొక్కివేస్తానని ప్రగల్భాలుకొట్టారు. కాని సుమారు రెండుసంవత్సరములు పోరాటం అమోఘంగా జరిగింది. 1921 ఉద్యమంలో 30 వేలమంది జైళ్ళకువెళ్ళారు. 1930 సం॥ లో 60 వేలమంది జైళ్ళకువెళ్ళారు, 1932 ఉద్యమంలో ఒకలక్షయిరువదివేలమంది జైళ్ళకు వెళ్ళారు.

ఈ 1932 సత్యాగ్రహోద్యమంలో భూలాభాయిదేశాయి పాల్గొని ఒకసంవత్సరం శిక్షననుభవించుటయేగాక, పదివేల రూపాయల జరిమానానుకూడా చెల్లించారు, జైలునుండి విడుదలై వచ్చినపిమ్మట 1934 లో జినీవాయందు జరిగిన అంతర్జాతీయ మహాసభలో కాంగ్రెసు ప్రతినిధిగా పాల్గొన్నాడు.

## శాసనసభా ప్రవేశం.

తర్వాత కాంగ్రెసు శాసనసభాక్రమణకు పూనుకొంది. అంతవరకు కాంగ్రెసు శాసనసభా బహిష్కరణమును గావిస్తూ, యిప్పుడు కాంగ్రెసు, శాసనసభా ప్రవేశమునకు అంగీకరించుటకు కారణము భూలభాయికృషియే. కాంగ్రెసు శాసనసభలలో యుంటూ, అవసరము వచ్చినప్పుడు వాటిని బహిష్కరించవచ్చునని వాదించి కాంగ్రెసును ఒప్పించినవారిలో భూలాభాయి కూడాఒకడు.

భూలాభాయిదేశాయి ప్రథమంగా కేంద్రశాసనసభా సభ్యుడుగా గుజరాతు నియోజకవర్గంనుంచి ఎన్నుకోబడెను. ఆయనను కేంద్రశాసనసభ్యులు కాంగ్రెసుపక్ష నాయకుడుగా ఎ

న్నుకొన్నారు. శ్రీ ఎస్. సత్యమూర్తిగారు భూలాబాయి క్రిం దనే ఉపనాయకుడుగా నుండెడివారు.

పండిత 'మోతీలాల్ నెహ్రూ' చనిపోయిన తర్వాత ఆయ నవంటి ప్రతిభాశాలి శాసనసభలలో కొరవయ్యెను. ఆయనవంటి పార్లమెంటేరియన్, శాసనసభా సాంప్రదాయలను కాపాడు దిట్ట, వాక్చాతుర్యము, వాగ్ధాటి గలవ్యక్తి శాసనసభలో ఎవ రుండగలరాయని కాంగ్రెసువారు ఆలోచించుచుండిరి. నిజంగా భూలాబాయిదేశాయి కేంద్రశాసన సభా నాయకత్వము వహించి ఆకొరత తీర్చగల్గెను.

భూలాబాయి కేంద్రి శాసనసభాసభ్యుడుగా ఎన్నుకోబ డినంతవరకు, ఈయనకు శాసనసభా వాతావరణము సరిగా తెలి యదు. ఆయన అడ్వకేడు జనరలుగా వున్నప్పుడు మాత్రం బొంబాయిలెజిస్లేటివ్ కౌన్సిలులో ఎక్సు–అఫిషియో సభ్యుడుగా నుండేవారు. అయినను, స్వయంకృషిమూలంగానే గొప్ప అను భవమునుగడించి ప్రజామన్ననలను పొందగల్గెను. 1936 సంవ త్సరములో ప్రభుత్వ విధానమునకు అసమ్మతి దెల్పుచూ, తన పార్టీసభ్యులతో అసెంబ్లీభవనమునుండి లేచివెళ్ళిపోయి ప్రజల మన్ననలను బడయగల్గెను.

అసెంబ్లీలో ఆయనచేసిన ఉపన్యాసములు ఒకతీవ్రవాది మాట్లాడేటంత ఘాటుగాయుంటూయుండేవి. ఇండోబ్రిటిషు వ్యాపారపుఒడంబడిక, జాయింటు పార్లమెంటరీ కమిటీనివేదిక, క్రిమినల్ లాసవరణబిల్లు, ఆర్మీ రిక్రూట్ మెంటుబిల్లు, సె నా

న్సుబిల్లు మొదలగు సందర్భములలో భూలాభాయిగారు చేసిన ఉపన్యాసాలు చాలాఅమోఘమైనవి.

అన్నిటికన్న విచిత్రమైన విషయమేమంటే, బ్రిటిషుప్రభుత్వము, ఇతరదేశాలలో భారతదేశంలో ప్రజాప్రభుత్వమే నిర్వహింపబడుతున్నదని ప్రచారంచేస్తున్న యుద్ధసమయంలో, భారతదేశానికి స్వాతంత్ర్యమివ్వడానికి అక్కడ హిందూ ముస్లిం సఖ్యత ఒక్కటే లోపించిందన్న సాకుతో ప్రచారంచేస్తున్న సమయంలో, భారత శాసనసభలో భూలాభాయిదేశాయి నాయకత్వమున అసెంబ్లీ సభ్యులు కాంగ్రెసువారు ముస్లింలీగువారు కూడాఏకమై, ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఫైనాన్సుబిల్లును అనేకమార్లు ఓడిరచారు. ప్రభుత్వం శాసనసభ్యుల ఐక్యతనుచూచి తెల్లబోయింది. హిందూముస్లిం సఖ్యత ఏర్పడుతుందేమోనని ఖంగారుపడింది. శాసనసభ్యులు ఫైనాన్సుబిల్లును ఓడించి, భారతదేశంలో ప్రజాస్వామిక ప్రభుత్వంలేదని ప్రపంచానికి నిరూపించారు. హిందూ ముస్లిం సఖ్యత, కాంగ్రెసు, ముస్లింలీగుల ఐక్యతలేదనే వారికిఅదిసత్యదూరమని తెలుపగల్గారు. ప్రజాప్రతినిధులైన శాసనసభ్యులు ఓడించిన బిల్లులను వైస్రాయి వీటోఅధికారముప్రయోగించి భారతప్రజపై రుద్దజూచే నిరంకుశవిధానాన్ని ప్రపంచానికి వెల్లడిచేశారు.

1935 నుండి 1945 వరకు ఈపదిసంవత్సరాలలో, దేశం రాజకీయ వాతావరణంతో అట్టుడికిపోతున్నకాలంలో శ్రీభూ

లాభాయిదేశాయి ఢిల్లీ సెంట్రలు అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుడుగాయుంటూ దేశంలో ఎంతఖ్యాతిని పొందగల్గాడు.

## వ్యష్టి శాసనోల్లంఘనం.

1939 సెప్టెంబరు నెలలో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. బ్రిటిషుప్రభుత్వము భారతీయులనుకూడా ఈ యుద్ధంలో భాగం పంచుకోవలసిందని కోరింది. భారతీయులు అందుకు తమ అసమ్మతిని దెలిపారు. 1927 నుంచి భారతదేశం బ్రిటిషువారి స్వార్థయుద్ధాలలో పాల్గొనదని, కాంగ్రెసు చెబ్తూనేయుంది. ఈయుద్ధం ప్రారంభంకాగానే, గాంధీ, కాంగ్రెసు కూడా, బ్రిటిషుప్రభుత్వాన్ని ఈయుద్ధంయొక్క ఉద్దేశమేమిటని అడిగారు. అందుకు ప్రభుత్వం ప్రజా స్వామ్యసూత్రాలను కాపాడి ఫాసిస్టు తత్వాన్ని రూపుమాపడమే ఈ యుద్ధతత్వమన్నారు. అయితే మీతోకలసి సమానంగా యుద్ధంచేసి శత్రువును పాతమార్చడానికి, మాకుకూడా మీతోసమానమైన ప్రతిపత్తి నివ్వవలసిందని కాంగ్రెసు, ప్రభుత్వాన్ని కోరింది. ప్రభుత్వం ఏమీ మాట్లాడకుండా, ప్రజలకు తెలుపకుండా, వారిసమ్మతి తీసుకోకుండా భారతదేశాన్ని తమస్వంత లాభంకొరకు యుద్ధంలోనికి లాగింది. పైగా ప్రభుత్వం ఇతరదేశాలలో భారతదేశం అంగీకరించే యుద్ధానికి సహాయంచేస్తోందని వాదించి, ప్రచారం చేయడం మొదలుపెట్టింది.

ఈ అసత్య ప్రచారాన్ని ఎదుర్కొనడానికి, భారతదేశం ప్రస్తుత. సామ్రాజ్యవాదుల మధ్యజరిగే యుద్ధానికి వ్యతిరేక మని ప్రపంచానికి తెల్పుటకుగాను యుద్ధవ్యతిరేక నినాదాల ద్వారా కాంగ్రెసు వ్యక్తిశాసనోల్లంఘనోద్యమమును ప్రారంభించింది.

ఆరు రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రివర్గాలు, భారత దేశం యుద్ధంలో పాల్గొనడానికి అసమ్మతి సూచకంగా తమ మంత్రిపదవులకు రాజీనామాలనిచ్చి, ఈవ్యక్తిసత్యాగ్రహంలో పాల్గొనెను. 1940 డిసెంబరు 1 వతేదీని ప్రభుత్వము భూలాభాయిని అరెస్టుచేసి, ఎరవాడ సెంట్రలుజైలుకు డిటెన్యూగా తీసుకొనివెళ్ళింది. భూలాభాయి జైలులో జబ్బుపడెను, ప్రభుత్వం భూలాభాయిని 1941 సెప్టెంబరు 17 వ తేదీని విడుదలజేసింది.

శ్రీ భూలాభాయిదేశాయి యిదివరలో కాంగ్రెసు కార్యవర్గసభ్యుడుగాను, బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగాను యుండెడివాడు. 1942 లో దేశాయి కాంగ్రెసు కార్యవర్గసభ్యత్వానికి రాజీనామానిచ్చాడు.

### ఆగస్టు విప్లవం.

1942 ఏప్రిలులో క్రిప్సురాయబారాలు విఫలమైనతర్వాత, "బ్రిటిషు ప్రభుత్వమును భారతదేశమునుండి వైదొలగ వలసినదని" కోరుటకు 1942 అగస్టు 7 వ తేదీని అఖిలభారత కాంగ్రెసు బొంబాయిలో సమావేశమైంది. ఆగస్టు 8 వ తేదీని

ప్రభుత్వం, భారత జాతీయ నాయకులను అరెస్టు చేసి అహమ్మదునగరు కోటలో బంధించింది. గాంధీమహాత్ముని పూనాలోని ఆగాఖాను భవనంలో బంధించింది. దేశంలో విప్లవం చెలరేగింది. ప్రభుత్వం విప్లవాన్ని అణచుటకు అనేక ప్రయత్నాలు చేసింది. చివరకు మారణయంత్రాలనుకూడా ఉపయోగించవలసివచ్చెను. గాంధీమహాత్ముడు జైలులోనున్నప్పుడు ఆయన సతీమణి కస్తూరిబా, ఆయనకుడిభుజముయైన మహాదేవ దేశాయి గార్లు పరలోకగతులైరి. ఈ నాయకులిరువురి మరణాలు ప్రజలను మరింతరెచ్చగొట్టినవి. తర్వాత గాంధీజీ ఆగాఖాను భవనంలో ఉపవాసంచేసి, ఆగస్టు ఉద్యమానికి కాంగ్రెసు బాధ్యతకాదనీ, ప్రభుత్వమే కారణమనీ నిరూపించెను. తర్వాత కొంత కాలమునకు గాంధీజీని అనారోగ్యకారణంచేత ప్రభుత్వంవిడిచిపెట్టింది.

## దే శా యి—లి యా క త్ ఆ లీ ఖా న్ ఒ డం బ డి క

భూలాభాయి యివిఅన్నీ పరిశీలిస్తూనే యుండెను. లోలోపల ఎంతో బాధపడుచుండెను. నెహ్రూ, అజాద్, గాంధీ లాంటి మహానాయకులు బందిఖానాలలో యుండడం దేశాయికి చాల బాధాకరంగాయుంది. వారివిడుదలకు, భారతదేశ ప్రతిష్టంభన పోవుటకు మార్గాలుఆలోచించడం మొదలుపెట్టెను. అతనికి ఒక్కటే ఆలోచనతట్టింది. శాసనసభా కాంగ్రెసు పక్ష నాయకుడుగా తాను. ముస్లింపక్ష ఉపనాయకుడు నవాబ్జాదా

లియాఖత్ ఆలీఖానుతో సంప్రదించి, అన్యోన్య మైత్రితో కేంద్రంలో జాతీయప్రభుత్వమును తాత్కాలికముగానైనా స్థాపించినట్లయితే దేశంలో కొంతసంక్షోభము తగ్గగలదని ఆలోచించెను, వెంటనే దేశాయి, లియాఖత్ ఆలీఖానుతో సంప్రదించి ఒకప్రణాళికను తయారుజేసెను.

అప్పటికి పూర్వమే యించుమించు ద్వితీయ ప్రపంచ యుద్ధము ప్రారంభమైనప్పటినుండియు, ముస్లింలీగు జనాబ్ జిన్నానాయకత్వమున, భారతదేశముయొక్క ఈశాన్య వాయువ్య భాగాలలో ముస్లింమెజారిటీ రాష్ట్రములను పాకిస్థాన్ అనే పేరుతో నిర్మించవలెనని కోరింది.

ఈ ముస్లింలీగు నాయకుని కోరికకు వ్యతిరేకంగా జాతీయముస్లిములు, ఈశాన్య వాయువ్య భాగాలలోని ముస్లిములు సురక్షితంగా యుంటే, దేశమంతా ఆవరించుకొనియున్న మిగిలిన ముస్లిములమాట ఏమిటన్నారు. జిన్నాగారి పాకిస్థాన్ వాదం దేశానికి ఘోర ప్రమాదమని జాతీయముస్లిములంతా వాదించారు భారతదేశాన్ని రెండుగావిభజించమన్నాడు జిన్నా. భారతదేశం అవిభాజ్యమన్నారు కాంగ్రెసువారు. జాతీయ ముస్లిములు జిన్నాగారి పాకిస్థాన్ వాదాన్ని పూర్తిగాఖండిస్తూ దేశంలో యిలాప్రచారంచేయడం మొదలుపెట్టారు.

భావిభారతప్రజలందరు సౌఖ్యప్రదంగా సంపూర్ణస్వాతంత్ర్యముతో తులతూగవలెనని జాతీయముస్లింలందరు ఆశిస్తున్నా

రు. అందుకు సర్వవిధముల పాటుపడవలెనని సంకల్పించుకున్నారు. ఇందుకుగాను వారు అవలంభించదలచిన రాజ్యపద్ధతి ముఖ్యంగా మూడుహంశములపై ఆధారపడి వున్నది.

ఒకటి : హిందూదేశము ఆంతరంగికవ్యవహారములన్నిటిలో సంపూర్ణరాజ్యాధికారమును ననుభవించు స్వతంత్రరాష్ట్రముల కలయికగల ఏర్పడిన అవిభాజ్యమైన ఒకేఒక దేశముగ వుండాలి.

రెండు : ఈ స్వాతంత్ర్య రాష్ట్రములన్నియు కలిసి యావత్తుహిందూదేశమునకు తప్పనిసరిగా సంబంధించిన దేశరక్షణ, విదేశవ్యవహారములు ఎగుమతి దిగుమతి సుంకములు, నాణెములు; రాకపోకల ప్రధాన సాధనములు మొదలైన రాజ్యాంగశాఖలను పరిపాలించుటకుగాను, ఏఒక్కరాష్ట్రముగాని, రాష్ట్రముల గుంపుగాని తక్కిన రాష్ట్రములమీద శాశ్వతముగ పెత్తనమువహించుటకు అవకాశము లేనివిధమున, ఒక సమిష్టికేంద్రప్రభుత్వమును ఏర్పరచి నడుపవలెను.

మూడు: హిందువులు అధిక సంఖ్యాకులుగ నున్న రాష్ట్రములలో స్వల్పసంఖ్యాకులగు ముస్లిములకు సంపూర్ణ మతస్వేచ్ఛ, తమ మతాచారములను, సాంప్రదాయలను నిర్వర్తించుకొనుటకు సంపూర్ణమగు నిరాటంక మైన స్వాతంత్ర్యము, యుద్ధానంతర ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణవిధానముల లాభమును పొందుటకు తక్కిన జాతులతోపాటు సమానమైన అవకాశములు, ప్రతిరాష్ట్రములో గౌరవకరమైన రాజకీయప్రతిపత్తి

ని రాజకీయస్థానమును అనుభవించుటకు అవసరమైన అన్నిరక్షణలు ఉండవలెను.

ముస్లింలీగ్ కు ప్రజలను ఉద్రేకపర్చుటకు ఒకే నినాదము కలదు. ఇది 'పాకీస్తాన్' నినాదము. హిందూదేశమున వాయువ్యమున యొక స్వతంత్రప్రభుత్వ మేర్పడుటయు, ఈశాన్యమున మరియొక స్వతంత్రప్రభుత్వ మేర్పడుటయు అచటిముస్లిములకు సంపూర్ణ రాజ్యాధికారము లుండుటయు జాతీయ ముస్లిములకుకూడ అంగీకారమే. కాని ఆ స్వతంత్ర ప్రభుత్వములు రెండు మిగిలినహిందూదేశమునుండి విడిపోవుటయు, మిగిలిన హిందూదేశముతో నెట్టిసంబంధము లేకుండుటయు మాకంగీకారముకాదు. అట్లు అవి హిందూదేశముతో సంబంధము తెంచుకొనిపోవుటవలన హిందూదేశములోనున్న పదికోట్లముస్లిం సోదరులు ఒకరితో నొకరికి రాజకీయముగాను, సాంఘికముగాను ఎట్టిసంబంధము లేని రెండు వేర్వేరుస్వతంత్రగుంపులుగా విభజింపబడుదురు.

అటులగాక ఆ రెండు స్వతంత్రప్రభుత్వములును, రాజకీయముగా మిగిలిన హిందూదేశమునకు కలిగే విశాలమైన జాతీయ అంతర్జాతీయ లాభములలో భాగస్వాములుగ నుండవలెనని ఇతర ప్రాంతములలో స్వల్ప సంఖ్యాకులుగ నున్నముస్లిముల గౌరవ ప్రతిపత్తికీ భారత కేంద్రప్రభుత్వములో నుండే ఆ రెండుప్రభుత్వములు ప్రతినిధులు తగిన రక్షణగాను అండగాను [illegible]

తక్కిన హిందూదేశముతో నెట్టిసంబంధము లేని పాకిస్తానము ఆర్థికముగా చూచినా దేశరక్షణదృష్ట్యా చూచినా కేవలము అసంభవము. మిగిలిన హిందూదేశము [illegible] పాకిస్తానము [illegible] దేశమునకు [illegible] శుభదాయకము [illegible]. అందుకు మహాత్మా గాంధిజీకూడ [illegible] నిరసించుచున్నారు.

ఈ రోజులలో చిన్న దేశములకు తావు లేదని మొన్న ముగిసిన ప్రపంచయుద్ధమునందు స్పష్టపడినది. ఇంగ్లాండునంటి దేశముకూడ ఒంటరిగ నిలువలేకపోయినది. అనేక సమయములలో మిత్రమండలిలో చేరిన దేశములపై ఆధారపడవలసి వచ్చినది.

హిందూదేశములో చిన్న స్వతంత్ర రాష్ట్రముల కలయికయే ప్రతిరాష్ట్రమునకు దేశమునకును సురక్షితమును సమకూర్చగలదు.

ఐకమత్యమేబలము వ్యక్తిపోరాటముకాదు మనకుకావలసినది; వ్యక్తిఅవభివృద్ధి. సంఘు వర్గకలహాములుగాదు మనము ఆశించవలసినది—సంఘు వర్గచైతన్యములు.

భారతదేశము ఇప్పటికి, ఎప్పటికి అవిభాజ్యమైనదే. దానిలో ఎన్ని స్వతంత్రప్రభుత్వములైన ఉండవచ్చును. గాని ఆర్థిక, వైదేశికాంగ, రక్షణ సమస్యలలో మాత్రము సంపూర్ణ ఐకమత్యము లేనియెడల భారతదేశముకూడ మరియొక "బాల్కనురాజ్య కూటమి" కాగలదు.

ముస్లింలీగ్ చేసే పాకిస్తాన్ ఆందోళన మనప్రజల, దేశపురోభివృద్ధికి దోహాదను నీయలేదు.

ఇటువంటి పరిస్థితులలో అందరిని సంతృప్తిపరచగలదనే అభిప్రాయంతో దేశాయి, లియాకతత్ అలీఖాన్ గార్లు ఒకనిర్ణయానికివచ్చి తమ ప్రణాళికను వైస్రాయి కందజేశారు.

వారిరువురి ఒడంబడికలోని ముఖ్యసూత్రాలియివి.

“భారతదేశరాజ్యాంగ భవిష్యత్తుకు ఏవిధమైన భంగము వాటిల్లకుండా కేంద్రప్రభుత్వాన్ని తాత్కాలికపద్ధతిపై పున్నరిర్మించడము కేంద్రతాత్కాలిక ప్రభుత్వంలో కాంగ్రెసు, ముస్లింలీగులకు సమాన ప్రాతినిధ్యముంటూ మిగిలిన అల్పసంఖ్యాకవర్గములకుకూడా న్యాయమైన ప్రాతినిధ్యమిచ్చుట.

ఈవిధంగా ఏర్పడే క్రొత్త ప్రభుత్వం ఇండియా చట్టానికిలోబడి పనిచేయుట. ఈప్రభుత్వం చేయు మొదటిపని కాంగ్రెసువర్కింగుకమిటీ సభ్యులను విడుదలచేయుట. వీటో అధికారం యధాప్రకారమున్నప్పటికీ, వైస్రాయి కార్యవర్గంలో ఎక్కువమంది సభ్యుల నిర్ణయాన్ని బట్టి నడచుకొనుట. ఇంకా ఇండియా సర్వసేనాని అధికారములను గురించి కూడా యిందులోగలవు.

ఈసూత్రాలను తీసుకొని భూలాభాయిదేశాయి, గాంధీమహాత్ముని ఆమోదముపొందుటకు పంచగనిలో విశ్రాంతితీసుకొంటున్న గాంధీవద్ద 1945 జూన్ 10 వ తేదీనివెళ్ళి, ఆయన ఆశీస్సులుపొందెను.

సిమ్లా సభ

భూలాభాయిదేశాయి, లియాకత్ అలీఖాన్ గార్ల ఒడంబడిక ఫలితంగా వైస్రాయి వేవెలు, లండనుకు వెళ్ళి అక్కడ బ్రిటిషు మంత్రులతో సంప్రదించెను. వైస్రాయి లండనునుంచి తిరిగి వచ్చి 1945 జూన్ 15 వ తేదీని వర్కింగుకమిటీ సభ్యులను విడుదల చేయించాడు.

భూలాభాయి, లియాకత్ గార్ల సూత్రాలును ప్రాతిపదికగా తీసుకొని, బ్రిటిషు మంత్రులతో చర్చించి, వారి ఆమోదమును పొందబడిన వేవెలు ప్రతిపాదనలను చర్చించుటకు సిమ్లాలో కాంగ్రెసు, ముస్లింలీగు మొదలగు వివిధ పార్టీల మహాసభ జరిగింది. ఆసభకు వేవెలునే అన్నిపార్టీలవారు నాయకుడుగా అంగీకరించారు. వేవెలుప్రభువు 1945 జూన్ 29 నుండి జూలై 14 వరకు సమావేశం సాగించి సాగించి, సిమ్లావైపు ఆశలు పెట్టుకొని చూస్తున్న భారతజాతికి, సంప్రదింపులు భగ్నమైనవనే ఆశ్చర్యవార్తను చివరకు అందిచ్చాడు. వేవెలుప్రభువును భూలాభాయి ప్రతిపాదనలను ఆధారంగా తీసుకొని, సిమ్లాసమావేశం జరిపెనుగాని, దేశాయి తలపెట్టిన తాత్కాలిక ప్రభుత్వాన్ని వేవెలు ఏర్పరచలేకపోయాడు. సిమ్లా సభానంతరము, జూలై 14వ తేదీని వైస్రాయి వేవెలు ఒకప్రకటన గావిస్తూ "ఈ సభావైఫల్యమునకు బాధ్యుడనునేనే" అనిఅన్నాడు.

సిమ్లాసభ విఫలమైనతర్వాత దేశములోని కొందరు జాతీయవాదులు భూలాభాయిని నిందించసాగారు. కాంగ్రెసు వ

ర్కింగు కమిటీ సభ్యులంతా జైళ్లలో నుండగా దేశాయి స్వతంత్రించి ప్రతిపక్షులుతో ఒడంబడిక చేసుకొనుట తప్పని అంగీకరిన్నారు. కాని ఈసందర్భమున భూలాభాయి గారిపై [illegible] రిన ఆరోపణలను తీవ్రంగా విమర్శిస్తూ, [illegible] కేంద్ర అసెంబ్లీ కాంగ్రెసుపార్టీ కార్యదర్శి శ్రీప్రకాశ్ గారు చేసినప్రకటన గమనించదగ్గది.

"భూలాభాయి దేశాయిగారు గావించిన రాయబారములలో ఆయన కాంగ్రెసును తోసిరాజు చేసిరని కొందరు మనస్సులలో అనుమానములున్నట్లు పత్రికలలో ప్రచురించబడిన వ్యాసములవల్ల తెలుసుకొనుట నాకెంతయో కష్టము కలుగజేసినది. నవాబ్జాదా, తానుకలసి నూతన ప్రభుత్వ మేర్పరచువరకు వర్కింగుకమిటీ సభ్యులను విడుదలచేయరాదని ఆయనషరతు పెట్టెనని కూడాకొందరు ఆరోపణలు గావించిరి.

గతించిన చలికాలములో స్థితిగతులు చాలా నిరుత్సాహకరంగా నుండెననిన్నీ, వర్కింగుకమిటీని విడుదల చేయుదురను ఆశలేశమాత్రమైనను లేకుండెనని మిత్రులు మరువరాదు. తమ నిర్బంధవిషయమై వర్కింగు కమిటీ సభ్యులు ఉదాసీనముగ నుండిన యుండవచ్చును. కాని వారి నిర్బంధమువల్ల దేశములో నేర్పడిన దుర్భర పరిస్థితులకు వెలుపలనున్నవారు దుఃఖించి వారివిడుదలకు అనువగు పరిస్థితు లేర్పడునట్లు చేయుటలో తీవ్రముగా కృషిచేయుచుండిరి ఇందుకు తీవ్రముగా కృషి చేసినవారిలో దేశాయిగారు ఒకరు. ఇందువల్ల ఆయనచాలా

అపనింద పాలయ్యెను. కష్టములను లెఖచేయక ఆయన నిరంతరంగా చేసిన కృషికి నేనిందుమూలమున వ్యక్తిగతంగా నాకృతజ్ఞతను వెలిబుచ్చుచున్నాను.

కేంద్రీయమున ప్రజాప్రతినిధి ప్రభుత్వముగా నెంచబడు ప్రభుత్వముండుటకున్నూ, సరిహద్దుసంఘవలె రాజకీయ ఖైదీలవిడుదల సదరు ప్రభుత్వము బాధ్యతవహించుటకున్నూ, బ్రిటిషు ప్రభుత్వమువారు అనుకూలముగా నున్నట్లు సరిహద్దు రాష్ట్ర దృష్టాంతరమువల్ల స్పష్టమగుచున్నది. తామే స్వతంత్రముగా రాజకీయ ఖైదీలను విడుదలచేయుటకు ప్రభుత్వము వారా సమయమున యిష్టముగా లేకుండిరని స్పష్టమగుచున్నది.

నూతన ప్రభుత్వముచేయు మొదటిపని వర్కింగుకమిటీ సభ్యులవిడుదల యైయుండునని దేశాయిగారు నవాబ్జాదా లియాఖత్ ఆలీగారితో చేసుకొన్న ఒడంబడిక, కాంగ్రెసును త్రోసిరాజు చేయుటని ఎట్లు చెప్పవీలగునో దురూహ్యముగానున్నది. కాంగ్రెసు వాదులందరు కాంగ్రెసు శిక్షణమునకు లోబడియున్నారు. విడుదలయైనమీదట వర్కింగుకమిటీవారు దేశాయిగారి అభిప్రాయములకు అనుగుణముగాని నిర్ణయమునకు వచ్చినయెడల యితర కాంగ్రెసువాదులపై చర్యగైకొన్నట్లే, దేశాయిగారిపై చర్యగైకొనవచ్చునని తలచుటసబబు. ఏదో విధంగా కాంగ్రెసువర్కింగుకమిటీ సభ్యులను బయటకు వచ్చునట్లుచేసి, దేశంలో సాధారణ రాజకీయ పరిస్థితులేర్పడునట్లు

న్నా, క్షమసిక్షలు తొలగునట్లు చూచుట దేశాయిగారియొక్కయు, తక్కిన అందరియొక్కయు యుద్దేశమైయుండెను.

భూలాభాయి, లియాకతాలీ ప్రభుత్వము చేయుమొదటి పని (అదిఏర్పడినఎడల) వర్కింగుకమిటీ సభ్యుల విడుదలమై యుండుటను మరతురు, తన ప్రభుత్వమేర్పడువరకు వారిని విడుదలచేయుట కేవలము అన్యాయము. ప్రమాదముతో కూడిన దగుటచే వారిని విడుదలచేయుబాధ్యతను తాము నెత్తిపై వేసికొనజాలరని ప్రభుత్వము వారన్నప్పుడు ప్రతిష్టంభనమును తొలగించుటకు దేశాయిగారు గావించిన సూచనకంటెవేరుమార్గము లేక పోయెను దేశాయిగారు చేసిన కృషికి మనము ఆయనకు అత్యంత కృతజ్ఞులమై యుండదగుదుము. ఎందువల్లననగా, వర్కింగుకమిటీ సభ్యుల విడుదల, తరువాతజర్గిననాయకుల సభ దేశాయిగారి కృషిఫలితమే, యని నామటుకు నేను తలచుచు న్నాను. దేశాయిగారు చేసిన ప్రశస్తమైన సేవ తగువిధముగా గ్రహింపబడకపోవుట శోచనీయము. ఆయన సదుద్దేశములను శంకించుటయు, ఆయనపై ఆరోపణలుచేయుటయు కేవలము అవమానకరమని నాబుద్ధికి తోచుచున్నది. తాము చెరసాలలో నున్నసమయమున ఈమూడు సంవత్సరములనుండి దేశప్రజలు ఎట్టిదుర్భర దురవస్థలపాలయ్యారో యిప్పుడు చెరసాలనుండి బయటకువచ్చిన కాంగ్రెసుమహానాయకులకు తెలియజాలదు ఇప్పుడువారికొసంబడుచున్నఘనమైనస్వాగతములు, యిప్పుడున్న

వాక్స్వాతంత్రము, పత్రికలలో వ్రాయుస్వాతంత్ర్యము, మారిన వాతావరణ ఫలితమైయున్నది. దీనినిబట్టి వారు మోసపోరాదు.

ఈ సిమ్లా సభ విఫలానికి కారణం వైస్రాయి తంత్రాంగం. అట్లుండగా, జిన్నా అవలంబించిన విపరీత వైఖరి, ఆతని మంకుతనమే కారణమని కూడా చాలమంది రాజకీయవేత్తల అభిప్రాయం.

ఈసందర్భంలో డాక్టరు నవాబ్ సయ్యద్ యార్ జంగ్ బహద్దరు ఒకప్రకటన చేస్తూ జిన్నాను గురించి యిలాఅన్నాడు.

"జనాబ్ జిన్నా ముసల్మాన్లకు రెండు తరాలవరకూ తీరని మహాపకారం చేశాడు, ముసల్మానులలో భయం, తక్కువతనం ఏర్పడేటట్లు చేశాడు. ముసల్మానులంటే ప్రేమకంటే, హిందువులలో కొందరంటే తనకున్న ద్వేషమే, ఆయన ఈవిధంగా ప్రవర్తిస్తూండడానికి హేతువులా కనిపిస్తుంది.......... ............జనాబ్ **జిన్నాలో దైహికంగా గాని, మానసికంగా గాని ముస్లిం అంశ, సంస్కృతి ఎక్కడా కనిపించవనీ మౌలానా మహమ్మదాలీ అన్నట్లు జనాబ్ జిన్నా తనదేశం** కొరకు లాగుమడతైనా చెడవనికి ఒప్పుకోడనీ, రాజకీయ జీవితంలో ప్రవేసించిన దాది అతడు చేసిన త్యాగం ఏమీలేరనీ యార్జంగు బహద్దరు అంటూ యింకా యిలాఅన్నాడు.

జిన్నా యిన్నాళ్లు బూకరించుకొంటూ వస్తున్నాడు. గాని వేవెలు నొక్కవలసినచోట నొక్కాడనీ, భారతరాజకీయాలనుం

చి లీగు అదృశ్యం కావడం యింకెంతో కాలంపట్టదనీ కూడా డాక్టరు యార్జంగ్ బహద్దర్ అన్నాడు.

కాబట్టి సింమ్లాసభావైఫల్యానికి భూలాభాయి ప్రతిపాదనలు ఏమికారణం కావనీ, మీదు మిక్కిలి ఆతడు చాలప్రశంసనీయుడనీ కూడా మనకు పైప్రకటనవల్ల తెలియుచున్నది.

## మధ్యవర్తిత్వం

భూలాభాయిదేశాయికి దేశస్వాతంత్ర్యం కొరకు పోరాడే యువకులను చూస్తే ఎంతో సరదా.

1942 సంవత్సరంలో కాంగ్రెసు నాయకులను ప్రభుత్వం అరెస్టుచేసి ప్రజలమధ్యకు వెళ్లి ప్రచారంచేయగలిగిన పార్టీ ఒక్క కమ్యూనిస్టుపార్టీయే. కమ్యూనిస్టుపార్టీయొక్క సిద్ధాంతాలు కొన్నిటితో చాలామంది ఏకీభవించకపోయినా ఆపార్టీలోని సభ్యులు చేయుచున్న కార్యక్రమాన్ని చూచి చాలామంది సంతోషించేవారు. అటులావిధంగా ఈకమ్యూనిస్టుపార్టీ శ్రీ భూలాభాయిదేశాయియొక్క సానుభూతిని కూడా పొందగల్గింది.

కమ్యూనిస్టులు సామ్రాజ్యవాదుల మధ్యజరిగిన యుద్ధాన్ని ప్రజాయుద్ధమన్నారనీ, ఆగస్టు విప్లవాన్ని వెన్నుపోటుగా పొడిచారనీ. కమ్యూనిస్టులపై చాలామంది ప్రజలకు కోపం.

గాంధీగారు కారాగారంనుండి విడుదలైనపిమ్మట, తమ కార్యక్రమాన్నిగురించి కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి పి. సి.

జోషీగారు మహాత్మ గాంధీగారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. ఈఉత్తరప్రత్యుత్తరాలను గురించి దేశంలో అనేకరకాలుగా వింతవింతవార్తలు ప్రచారం కాదొడగినవి.

గాంధీజీ తనసందేహాలను తెల్పుతూ, కమ్యూనిస్టుపార్టీని అయిదు ప్రశ్నలువేశాడు. అవి యివి.

(1) మీరు ప్రజాయుద్ధమని అంటున్నారు. దీనిలో "ప్రజ" అన్నమాటకు మీనిర్వచనం ఏమిటి? కోటానుకోట్ల భారతీయుల క్షేమంకోసం, లేక ఆఫ్రికా అమెరికాల్లోని నీగ్రోల క్షేమంకోసం లేక వీరందరి కళ్యాణంకోసం జరుగుతున్న యుద్ధమనిభావమా; మిత్రమండలి ఇలాంటియుద్ధమేనా సాగిస్తూన్నారు.?

(2) మీరు ప్రాతినిధ్యం వహిస్తున్న కమ్యూనిస్టుపార్టీ ఆదాయవ్యయాలను తనిఖీచేసే అవకాశం ప్రజలలో ఎవరికయినా ఇస్తారా? అలాంటి అవకాశం ఉంటే నేను వాటిని చూడవచ్చునా?.

(3) గతరెండు సంవత్సరాలలోను కార్మికులచేత సమ్మెలు చేయించిన నాయకులను అరెస్టుచేయడంలో కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వానికి చాలతోడ్పడిందని అంటున్నారు—దీనివిషయం ఏమిటి?

(4) కాంగ్రెసు సంస్థలో జొరబడాలనే విధానాన్ని కమ్యూనిస్టుపార్టీ ఒకదురుద్దేశంతోనే అనుసరిస్తున్నదని అనుకుంటున్నారు !

(5) కమ్యూనిస్టుపార్టీ విదేశీయుల చెప్పుచేతులలో ఉండటం లేదా?

ఈప్రశ్నలకు జవాబులు వ్రాసి పి. సి. జోషీగారు, గాంధీగారిని ఒప్పించ లేక పోయారు.

చివరకు జోషీగారు తమపై మోపబడిన నేరాలకు ప్రిదానన్యాయస్థానంఎదుటకూడా నిలబడ్తానన్నారు. ఈవిషయంలో బూలాభాయిదేశాయి, సరోజనీదేవి, రాజగోపాలాచారిగార్లను పెద్దలుగా ఏర్పాటుచేసి, వారి అభిప్రాయాలను తీసుకోనవలసినదని గాంధీజీని జోషీగారు కోరారు.

రాజాజీ జోషీతో తాను చెప్పదలచుకొన్నదంతా గాంధీజీతో చెప్పానని గాంధీతో, తనను పక్షపాతిగా భావిస్తున్నారనే కారణంచెప్పి ఈవిషయంలో అసలు సలహాచెప్ప నిరాకరించాడు. బూలాభాయిదేశాయిగారికి మాత్రం గాంధీజీ యిందుకు సంబంధించిన కాగితాలన్నీ యిచ్చి ఆయన అభిప్రాయాన్ని తెలుపమన్నాడు.

బూలాభాయి తన అనారోగ్యకారణంవల్ల వెంటనే కాగితాలన్నీ పరీక్షించి, తనఅభిప్రాయాన్ని దెలుపలేకపోయినా, తర్వాత తనఅభిప్రాయాన్ని గాంధీజీకి అందజేశాడు.

బూలాభాయిదేశాయివంటి ప్రముఖుని రెండు పెద్దపార్టీలమధ్య ఒకమధ్యవర్తిగా యుండమని కోరడం ఆయునను ఇరుపలవారు పార్టీపక్షపాతంలేని ప్రముఖునిగా గుర్తించడమేనన్నమాట.

అజాద్ హింద్ ఫౌజు విచారణ

బూలాభాయిదేశాయి జీవితంలో మహత్తరమైనఘట్టం అజాద్ హిందుఫౌజు విచారణ. భారతదేశమునుండి రహస్యముగా జపానువెళ్ళిన సుభాను చంద్రబోను నాయకత్వమున, శత్రుపక్షమునకు లొంగిపోయిన భారతప్రభుత్వసైన్యము, స్వతంత్రజాతీయసైన్యం (అజాద్ హిందు ఫౌజు) గా ఏర్పడి భారతదేశస్వాతంత్ర్యమునకు బ్రిటిషువారితో పోరాడ మొదలిడెను. ఈ అజాద్ హిందు ఫౌజులో జాతి, మత కులభేదములులేక సైనికులంతా సమైక్యతతో కలసి భారతదేశమునుండి బ్రిటిషుప్రభుత్వమును వైదొలగించ ప్రయత్నించిరి. తర్వాత క్రమక్రమంగా ద్వితీయప్రపంచ సంగ్రామం సమాప్తిజెందడం, జర్మనీ, ఇటలీలు పరాజయం పొందడం, ఆతర్వాత జపానుకూడా మిత్రమండలికి లొంగిపోవడం జరిగాయి.

జపాను ప్రభుత్వం పరాజయ మొందగానే, అజాద్ హింద్ ఫౌజుసైన్యముకూడా శత్రువుకు లొంగవలసివచ్చెను. అజాద్ హింద్ ఫౌజు సైనికులను చాలమందిని బ్రిటిషు ప్రభుత్వము బంధించింది. అందులో కొంతమందిని ఢిల్లీలోని లాల్ ఖిల్లాలో (ఎర్ర కోటలో) బంధించి, నానాబాధలు పెట్టనాగింది.

భారత ప్రభుత్వము ఈ అజాద్ హిందు ఫౌజు సైనికులను ఏర్పాటుచేయుటకు ప్రత్యేక కోర్టు నేర్పాటుచేసెను. ఈ అజాద్ హిందుఫౌజుతరఫున ముందుగా విచారించబడిన వీరులు

ముగ్గురు. వారు కెప్టెన్ షానవాజ్. లెఫ్టినెంటు సైగాల్, లెఫ్టినెంటు ఢిల్లాన్. ఈముగ్గురిని ప్రభుత్వము ఢిల్లీకోటలో విచారిస్తూండగా భారతీయులయొక్కయేగాక. విదేశీయులయొక్క దృష్టికూడ ఢిల్లీలోని లాల్ ఖిల్లాపై కేంద్రీకరింపబడెను.

ఈఆజాద్ హిందు ఫౌజు సైనికుల తరఫున వాదించుటకు కాంగ్రెసు మహాసంస్థ బూలాభాయిదేశాయి, అసఫాలీ, పండితజవహర్లాల్ నెహ్రూ మొదలగు న్యాయవాదులను పంపిది. ఈవిచారణలో ఎక్కువ శ్రమతీసుకొని బోసువీరుల విడుదలకు కృషిచేయగల్గింది బూలాభాయి యనిచెప్పుటలో అతిశయోక్తి ఏమీలేదు.

ఇంతవరకు నేరస్థులుచేసిన నేరము తమ మాతృదేశ దాస్యవిమోచనకు బ్రిటిషుప్రభుత్వంతో యుద్ధముచేయుటయే. సుభాసు చంద్రబోసు సర్వసేనాధిపత్యమున స్వతంత్ర ప్రభుత్వ మునుస్థాపించి, తమమాతృదేశముకొరకు ప్రాణములర్పించినందుకు బోసువీరులు భారతప్రభుత్వముచే రాజద్రోహులుగా పరిగణింపబడ్డారు. ఈవిచిత్ర నేరారోపణకు ప్రపంచములోని స్వతంత్ర రాజ్యాలన్నీ ముక్కుపై వేలువేసుకొనెను.

ప్రతివ్యక్తి "స్వరాజ్యము నాజన్మహక్కు" అనిఎలుగెత్తి చాటే ఈరోజులలో, దాస్యవిముక్తిని కోరి స్వాతంత్ర్యసాధనను అభిలషించి, బ్రిటనుపై యుద్ధంచేసిన ముగ్గురు అజాద్ హిందు ఫౌజు సైనికోద్యోగులను "రాజుపై యుద్ధప్రకటన" అనే నేరంక్రింద విచారిస్తూన్నందుకు నభ్యాతా ప్రపంచమంతా

తెలవంచుకొని, లాల్ ఖిల్లా తీర్పుకు ఎదురుచూడడం మొదలు పెట్టింది. ఆనాటి లాల్ఖిల్లా విచారణను భారతీయులు యావన్మంది తమవిచారణగా తలుచుకొంటూ, తీర్పుకొరకు తహతహలాడారు.

హేమాహేమీల్లాటి న్యాయవాదుల సమక్షంలో, ప్రభుత్వపక్షీయులైన న్యాయమూర్తుల ముఖస్థంలో, తీర్పుఅనంతరము ఏలాటి ఉరికంబాలెక్కవలసి వస్తుందో యని న్యాయమూర్తుల తుదినిర్ణయముకొరకెదురు చూచుచున్న బోసువీరుల సాన్నిధ్యంలో భూలాభాయిదేశాయి ముద్దాయిలు నిర్దోషులని చెప్తూ "పరప్రభుత్వంపై యుద్ధప్రకటన ప్రతిపరతంత్రజాతి జన్మహక్కు" అనిఉద్ఘాటించాడు. అంతర్జాతీయ రాజకీయ సూత్రాలను, న్యాయశాస్త్ర సూత్రాలనుఏకరువుపెట్టాడు. భూలాభాయి తన వాదనాప్రతిభనంతా ఆనాడు ఆలాల్ ఖిల్లా విచారణలో వాదించుటకు ధారపోసెను, ఆతనివాదన విని సంతసించదగనివ్యక్తి, దేశాయిని ప్రశంసించనివ్యక్తి భారతదేశంలో లేడు. భారతదేశంపేరు ప్రఖ్యాతులు దేశాయివాదనవల్ల ప్రపంచంలో మరింతహెచ్చినవి.

భూలాభాయిదేశాయి ఆనాడు తాను వాదించిన వాదనను ఈదిగువ సంగ్రహముగా పొందుపరచడమైనది.

### భూలాభాయి వాదన

"ఆజాద్ హింద్ ఫౌజు వీరుల డిఫెన్సుకై 112మంది సాక్షులచే వాఙ్మూలాలు చెప్పించదలచాడు మొదట్లో శ్రీ

భూలాభాయిదేశాయి కాని ప్రాసిక్యూషను తరఫున 28 సాక్షులనూ విన్నమీదట, తనపని తేలికయైనట్లుగా భావించి, 11 మంది సాక్షులతోనే సరిపుచ్చి, అజాద్ హిందు ఫౌజు వీరుల చర్యలు సమర్థిస్తూ రెండురోజులు దీర్ఘోపన్యాసాలు చేశాడు."

ఉపన్యాసాల సారాంశం.

కోర్టుమార్షలులలో జరిగే విచారణ సాధారణంగా వ్యక్తులుచేసిన నేరాలకు సంబంధించి మాత్రమే వుంటుంది. ఈ కేసు అలాంటిదికాదు. ముగ్గురువ్యక్తులు సార్వభౌమునిపై యుద్ధం ప్రకటించడమనే నేరాన్ని చేశారా లేదా అని కాదిక్కడ ప్రశ్న, యుద్ధం ప్రకటించినది సువ్యవస్థితమైన ఒకసైన్యం. ఈముగ్గురు వ్యక్తులూ ఆసైన్యంలోని వారు మాత్రమే.

కనుక ఇప్పుడిక్కడ విచారించవలసిన విషయం, ఒకపరాధీనజాతికి తన స్వాతంత్ర్యంకోసం యుద్ధంచేసే హక్కు వున్నదా లేదా అని. ఉన్నదనడానికి అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో నుంచి అనేక ప్రమాణాలు నేను చూపింపగలను.

సువ్యవస్థితమైన తాత్కాలిక స్వాతంత్ర్యభారత ప్రభుత్వపు ఆధ్వర్యాన యుద్ధంచేసింది ఈసైన్యం. మలయాలోని 2 లక్షల 50 వేలమంది ప్రజలిఖితపూర్వకంగా భక్తిని వెల్లడించిన ప్రభుత్వమది. తూర్పు ఏషియాలోని 20 లక్షల ప్రజకూడా దానియెడ భక్తివిశ్వాసాలు ప్రకటించారనే చెప్పవలసివుంది. పైగా అక్షరాజ్యాల ఆమోదంకూడా పొందింది. ఇవన్నీ కల్పనలుకావు.

ప్రబలమైన సాక్ష్యపురస్సరంగా రుజువౌతున్న యదార్థ విషయాలు.

అజాద్ హింద్ ఫౌజు సువ్యవస్థితమైన సైన్యమనీ, దానికొక చట్టంగూడ ఏర్పడిందనీ, నేనాట్టే శ్రమపడనవసరం లేకుండానే, దస్తావేజులపై దస్తావేజులు ప్రాసిక్యూషను వారే దాఖలుచేసి రుజువుచేసినందుకు ధన్యవాదాలు. అయితే, ఆచట్టంలో కొరడాలతో కొట్టేనిబంధనను మాత్రం అధిక్షేపించారు అడ్వకేటు జనరలుగారు.

బహుశః, 1911 ఇండియన్ ఆర్మీచట్టంలోని 45 వ సెక్షనును వారు మరచిపోయివుండాలి. బ్రిటిషు ఇండియను లాక్రింద దండనార్హమైన ఏ సివిలు నేరానికైనా వారంటు ఆఫీసరు హోదాకంటె తక్కువహోదాలో వున్నవారిని 30 కొరడా దెబ్బలవరకు కొట్టవచ్చునని అందులో స్పష్టంగా వుంది.

యుద్ధకాలానికి అది తొలగింపబడినమాట వాస్తవం. కాని అంతమాత్రంచేత, ఇండియన్ స్టాట్యూట్ లాలో అట్టిది లేదనడానికి వలనుపడదు. ఇప్పుడు కూడా, కొరడాలతో దెబ్బలుకొట్టడాన్ని ఆమోదిస్తున్న సందర్భాలు డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సులో చాలావున్నాయి.

తాత్కాలిక భారతప్రభుత్వం యుద్ధం ప్రకటించిందంటే రెండు లక్ష్యాలతో యుద్ధం ప్రకటించింది. ఒకటి, ఇండియాకు స్వాతంత్ర్యంకోసం. రెండు, తూర్పు ఏషియాప్రజలు ధనమాన ప్రాణాలను రక్షించడం కోసం.

అదీగాక ఈనూతన ప్రభుత్వానికి జపానుప్రభుత్వం అండమాను, నికోబారు దీవులను ధారాద త్తంచేసింది. స్వంతంగా ఈప్రభుత్వం జయవాడే అనే 50 చ. మైళ్ళ విస్తీర్ణంగల భూభాగాన్ని సంపాదించింది. సుమారు 1500 చ. మైళ్ళ విస్తీర్ణంగల మణిపూరు, విష్ణుపూరు ప్రాంతాలను ఆయిదారు నెలలపాటు పరిపాలించింది.

అండమాను దీవులను యథావిధిగా అన్ని శాఖలలోను పరిపాలించడంజరిగిందా అనేది వేరుమాట. కర్నల్ లోకనాథం రెండుశాఖలను మాత్రమే నిర్వహించినమాట వాస్తవం. ఆ రెండు శాఖల్లో ఒకటి విద్యాశాఖ. ప్రదేశంచిన్నది. ఖర్చుతక్కువ. స్కూళ్ళు ఎన్నో లేవు. అని అధిక్షేపించవక్కరలేదు. దామాయిషాను; 15% అక్షరాస్యులున్న మనదేశంలోకంటె చాలఎక్కువ స్కూళ్ళేవున్నాయి. ఇంకో ముఖ్యవిషయం, ఈ దీవులకు, షాహిద్, స్వరాజ్ అని నూతననామకరణం జరిగింది.

జయవాడీలో 15,000 మంది ప్రజలున్నారు. వారందరూ భారతీయులు. వీటినికూడా అజాద్ హింద్ ఫౌజు ప్రతినిధే పరిపాలించారు.

అజాద్ హింద్ ఫౌజు ఇండియా–బర్మాసరిహద్దును దాటినప్పుడు రెండుఫర్మానాలు జారీచేయబడ్డాయి. ఒకటి స్వతంత్ర భారత ప్రభుత్వాధ్యక్షునిచేత రెండవది జనరల్ కావాబే చేత జపానుసైన్యం జయించే భారతభూభాగమంతా అజాద్

హిందూ ఫౌజుకే అప్పగించబడుతుందనీ, వాతే దానిని పరిపాలి స్తారనీ ఆఫర్మానాల సారాంశం.

"స్టాంపు కలెక్టింగు" అనే వారపత్రికలో టి. యే. బో్రహెడ్ అనే విలేఖరివ్రాశాడు—ఇంఫాలులో ఉపయోగించ డానికై తయారుచేయబడిన ముక్కాణీ, అణాస్టాంపుల ప్రూఫ్ కాఫీలు తానుచూచానని, ఢిల్లీకోటబొమ్మ, "ఢిల్లీచలో" అనే నినాదం వాటిపై ముద్రించబడివుంది. "తాత్కాలిక భారత ప్రభుత్వం" అని రెండుభాషలలోకలదు. దరిమిలా, వీటిఅవ సరంలేక యీఅచ్చులు భగ్నంచేయబడి, స్టాంపులు తగులబెట్ట బడ్డాయి.

ఈవిషయాలనుబట్టి ఎప్పుడైతే తాత్కాలిక భారత ప్రభుత్వంఅంటూ ఏర్పడి పనిచేయడం ప్రారంభించిందో దానికి యుద్ధం ప్రకటించేహక్కుకూడ ఉన్నదని ఒప్పుకోకతప్పదు. అట్టి యుద్ధకాలంలో జరిగేపనులు మామూలు 'లా' క్రిందికిరావు. యుద్ధకాలంలో ఒకజర్మను దేశీయుడు బ్రిటిషుదేశీయుల నెవరి నైనా తుపాకీతోకాల్చిచంపితే, దానిని హత్యాదోషంక్రింద శిక్షిస్తారా?

అయినా పరదాస్యంనుండి విముక్తిగాంచడానికై జరిపే యుద్ధం నేటిఅంతర్జాతీయ న్యాయశాస్త్రప్రకారం ధర్మసమ్మ తమే అవుతుంది. దీనికి ఆయుద్ధంచేసే ఉభయపక్షాలూ స్వతంత్ర రాజ్యాలుగానే, ఉండనక్కరలేదు. బోయరుయుద్ధం ఏమిటి ?

బ్రిటిషు చరిత్రలో ఒకటవ ఛార్లెస్‌ను ఉరిదీయడం ఏమంటారు? రెండవ జేమ్సు ఉదంతం ఏమనాలి ?

అజాద్ హింద్ ఫౌజు సైనికులు తిరుగుబాటుదార్లే కావచ్చు కాని, అమెరికన్ సభాపతి గ్రాంటు 1870 లో ఏమన్నాడు ? తిరుగుబాటుదార్ల పోరాటం అంతర్జాతీయ ధర్మప్రకారం యుద్ధంకిందికే వస్తుందనలేదా ? దేశంలో అంతర్యుద్ధం పొసగినప్పుడు, అమలులోవున్న ప్రభుత్వాన్ని రెండవపక్షం జయింపలేక ఓడిపోయినాగూడా, ఆయుద్ధాన్ని పురస్కరించుకొని వ్యక్తులపై దోషారోపణచేయరాదని తీర్పిచ్చాడు. అమెరికా ఫెడరల్ కోర్టు ప్రధానన్యాయమూర్తి ఫుల్లరు.

వెనుక స్పానిష్ అమెరికన్ కాలనీలు స్వాతంత్ర్యంకోసం స్పెయిను ప్రభుత్వంపై తిరుగుబాటుచేసినప్పుడు, ఆకాలనీల పోరాటాన్ని సక్రమయుద్ధంక్రింద పరిగణించింది బ్రిటను. పరాదీన జాతికి స్వాతంత్ర్యం సంపాదించుకొనేహక్కు ఎప్పుడూ వుండనే వుంది. ప్రభుభక్తి అనేది శాశ్వతధర్మమేకాదు. అయితే ఏపరాధీనజాతీకూడా ఎప్పటికి స్వాతంత్ర్యసిద్ధిని గాంచడమనేది వుండదు.

ప్రభుభక్తికీ, దేశభక్తికీ సంఘర్షణ వచ్చినప్పుడు, మానధనులైనవారు దేశభక్తినే వరించారనడానికి, 1776 లో జరిగిన అమెరికా స్వాతంత్ర్య ప్రకటనమే ప్రబలనిదర్శనం. మొన్నటి యుద్ధంలో ప్రపంచాన్ని విలయాన్నుండి తప్పించి, ప్రపంచపశ్యతను కాపాడుటకెంతో కృషిచేయ గలుగుతూన్న అమెరికా

సిదర్శనమే పనికిరాకపోతే, ప్రపంచంలో న్యాయానికి తావేలే కుండ పోయిందన్న మాట.

"లా ఆఫ్ నేషన్సు" అనే వాటిల్ మహాశయుని ప్రామాణిక ప్రాచీనాంగ్ల ధర్మ శాస్త్రగ్రంథంలో స్పష్టంగా చెప్పబడివుంది. ఒకప్రజల రాజ్యసంరక్షణ క్రిందవున్న ఒకదుర్బల రాజ్యాన్ని ఆప్రబలరాజ్యం సంరక్షించ లేకపోయినపుడు, ఆదుర్బలరాజ్యం వెన్వెంటనే తన స్వాతంత్రతను తిరిగిపొందుతుందని. అజాద్ హింద్ ఫౌజు నిర్మాణసందర్భంలో నిజంగా అట్టి పరిస్థితు లేపర్పడ్డాయి.

ఇక ముద్దాయిలు కూరకృత్యాలూ హత్యలూ జరిపారన్నసంగతి, ప్రాసిక్యూషను సాక్షులే క్రాసుపరీక్షలో దీన్ని ఖాయపరచి చెప్పలేకపోయారు. హింసలు పెట్టారని వీరంటున్నది నియమోల్లంఘన చేసినందుకు శిక్షావిధియేగాని మరియొకటి గాదు.

కాగా, హత్యలు చేశారన్నది యెంతమాత్రమూ రుజువుకాలేదు. మహమ్మదు హుస్సేనును తుపాకితో కాల్చినట్లు చెప్పుతున్న ముగ్గురిలో జాగిరిరాం అనేసిపాయి, తానది వరకెన్నడూ తుపాకీని పట్టియుండలేదన్నాడు. కాని, ముగ్గురి తుపాకి గుండ్లూ మహమ్మదు హుస్సేనుకు సరిగ్గాగుండెలో తగిలాయట. ఈకథను ఎంతవరకు నమ్మవచ్చునో న్యాయాధికారులే ఊహించగలరు.

బూలాభాయియొక్క ఈలాంటి డిఫెన్సువాదన ఎంతో గొప్పన్యాయవాదియై, అంతర్జాతీయ న్యాయశాస్త్రం బాగుగా తెలిసివుండి అనుభవంయుంటేనేగాని ఎవరూ వాదించలేరు. ఈ యవవాదనపై ముద్దాయిలను చివరకు తుదినిర్ణయంగా ఎట్టిష రతూ లేకుండా ప్రభుత్వం విడుదలచేసింది.

భూలాభాయి నభినందన

బోసువీరులు విడుదలై నారన్నవార్త ప్రజలువినగానే, బూలాభాయి నభినందిస్తూ దేశమన్నిమూలలనుండే తంతివార్తలు వచ్చినవి. ఈవిచారణ యనంతరము బూలాభాయి ప్రజల మన్ననలకు మరింత పాత్రుడయ్యాడు—బోసువీరులు, దేశాయి నభినందించిరి. అభినందనేగాదు——శాశ్వతంగా దేశాయికి కృతజ్ఞులై యుండిరి. ఈసందర్భంలో జాతీయనాయకులు కూడా దేశాయి నభినందిస్తూ తంతులనిచ్చిరి. ప్రజలు దేశాయిని పుష్ప మాలాంకృతులనుచేసి ఆరాధించిరి. ఈఅజాద్ హింద్ ఫౌజు విచారణ భారతదేశ చరిత్రలో ఒకచరిత్రాత్మకమైన ఘట్టం.

అజాద్ హింద్ ఫౌజు కట్టుబాట్లు

బూలాభాయిదేశాయి ఒకమారు బొంబాయిలోని ప్రోగ్రెసివు గ్రూపు సభలో ఉపన్యసించుచు, విస్మయముగొల్పు అజాద్ హిందు ఫౌజు కట్టుబాట్లనుపొగుడ్తూ ఇట్లుఉపన్యసించిరి.

“కోర్టుమార్షలువారు షానవాజ్, సైగాల్, ధిల్లన్ గార్లను విచారించినప్పుడు భారత జాతీయసేనకుజెందిన 40 వేల ఆఫీసరులు, సామాన్యసైనికులు లాల్ ఖిల్లాలో విచారింపబడు

చుండిరి. ఈవిచారణ బ్రిటిషుపరిపాలనా శృంఖలాబద్ధమైయున్న తనమాతృదేశ విమోచనకై ఒకగొప్పసేనను, స్వతంత్రప్రభుత్వమును స్థాపించిన 40 వేల ధీరులయొక్కయు, దేశభక్తులయొక్కయు విచారణయైయుండెను. ఈముగ్గురు ఆఫీసరులు కేవలము వ్యక్తులుగారు. భారత స్వాతంత్ర్యమునకై తమజీవితములను అర్పణచేసినట్టియు, స్వాతంత్ర్యసాధనకై యెట్టిత్యాగమునైనను చేయ నంసిద్ధులైనట్టి భారతయువకులు ప్రతినిధులై యున్నారు.

అజాదు హిందు ఫౌజు విచారణవల్ల ఉత్పన్నమైన ప్రధాన సమస్యల విషయమై ఆలోచింపుడు. అదికేవలము భారత సేనపై తిరుగబడిన కొంతమంది ఆఫీసర్లను విచారించుటకు జరిగిన కోర్టుమార్షలని భావింపకుడు. కొలది పాశ్చాత్యరాజ్యముల వారు ప్రాచ్యఖండముపై అధికారమునెరపుటను భారతీయులు వాస్తవమైన దానినిగా అంగీకరించుచుండుట శోచనీయము. భారతసేనలోని వారంతా సంప్రదాయసిద్ధమైన రాజభక్తి కలవారను విషయము నిర్వివాదమని ప్రజలుతలచుచుండిరి. ఐనప్పటికి గతప్రపంచ సంగ్రామసమయమున నేర్పడిన విపరీత పరిస్థితులలో అజాద్ హింద్ ఫౌజు ఆవిర్భవించింది. విశ్వాసపాత్రులగు భారతసైనికులతో కూడిన ఈ అజాద్ హింద్ ఫౌజు బ్రిటనుపై యుద్ధము ప్రకటించుటకూడా తటస్థించెను. ఇట్లగుటచేత, చరిత్రాత్మకమగు ఈఅజాద్ హిందు ఫౌజు విచారణవల్ల ఉత్పన్నమగుచున్న ప్రధానసమస్యలు ప్రతిభారతీయుని ఆలోచనా నిమగ్నునిగా చేయ వలసియున్నది. మన[illegible]ల స్వాతంత్ర్యమునకై

భారతసైనికులు యింత ధైర్యసాహసములతో పోరాడగలిగిన యెడల భారతీయులను దాసులనుగా నుంచువారిని ప్రతిఘటించి వారు తమమాతృదేశ స్వాతంత్ర్యమునకై ఇంకాఎక్కువ ధైర్య సాహసములతో తప్పకపోరాడెదరు. దేశస్వాతంత్ర్యము తదితర సమస్యలకంటె యెక్కువ గుణపాఠమును చరిత్రాత్మకమగు అజాద్ హింద్ ఫౌజు విచారణ భారతీయులకునేర్పినది" అజాద్ హిందు ఫౌజు విచారణ ముగిసినపిమ్మట బూలాభాయి రాజకీయములనుండి విరమించెను.

## భూ లా భా యి ని ర్యా ణ ము.

అజాద్ హిందు ఫౌజువిచారణ జరిగినప్పటినుండి భూలాభాయి శరీరంలో అస్వస్థత ప్రవేశించినది ఈతని ఆరోగ్యము చెడిపోవుటకు కారణము దేశాయి అజాద్ హింద్ ఫౌజు విచారణసమయములో నిద్రాహారాలుమాని వాదనలకొరకై కృషిచేయుయుని పెద్దలంతాచెప్పిరి. చివరకు అస్వస్థత తీవ్రముగు జబ్బు రోసక దింపింది. సంధించింది. దేశాయికి సహజంగాయుండే దేశాభిమానంవల్ల కాంగ్రెసు వర్కింగుకమిటీసభ్యుల సాంగత్యంవల్ల సంధిలోకూడా కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా అబ్దుల్ కలాం అజాదుకొరకు "అజాద్, అజాద్" అనికలవరించసాగాడు. డాక్టర్లు దేశాయిపరిస్థితిచూచి పెదవివిరిచారు. 4 మాసములు అస్వస్థవల్లతీసుకొని తుదకు 1946 మే 5వతేదీ రాత్రి 1-5 ని॥లకు బొంబాయిలోని తనస్వగృహములో నిర్యాణమునుపొందిరి.

బూలాభాయి దేశాయి చనిపోవుసరికి ఆయనకు 68 సంవత్సరములు. ఈయన చనిపోయినారన్నవార్త రేడియోలద్వారా దేశప్రజలంతా దుఃఖసాగరమున మునిగిపోయిరి.

దేశంలో ప్రముఖన్యాయవాది, రాజకీయవేత్త పోయినాడనే పరితాపం ప్రతివారిని ఆవరించింది,

ఊ రే గిం పు.

మరునాడుదయము పదిగంటలకు బూలాభాయిదేశాయి మృతశరీరము కాంగ్రెసు భవనమునుండి ఊరేగింపుతో శ్మశానవాటికకు తీసుకొనిపోబడెను. కాంగ్రెసు భవనంపైన త్రివర్ణపతాకం సంతాపసూచకంగా సగము క్రిందికిదింపబడెను. ముఖ్యమైన రస్తాలమీదుగా ఊరేగింపు వచ్చెను. కాంగ్రెసు భవనానికి ఉదయము 8 గంటలకు దేశాయిగారి శరీరముతీసుకొనిరాబడెను. పెద్ద వేదికమీద పైనచాందినికట్టి చాందినిఅంతా జాతీయపతాకములతో అలంకరించి ఆవేదికమీద దేశాయిగారి మృతశరీరముంచబడెను.

బొంబాయి ప్రధాని బి. జి. ఖేరు, బొంబాయి మేయరు మహమ్మదు భాయిరావుజీ, సర్ శాంతిదాస్ అసుగాన్, బొంబాయి న్యాయవాద ప్రముఖులగు సర్ హెచ్. పి. మోడిగారు యింకా చాలామందివచ్చి తమఅంత్య నమస్కృతులొసరించి వెళ్ళిరి.

## అజాద్ హింద్ ఫౌజు జోహారు.

అజాద్ హిందు ఫౌజులోనివారు చాలమంది షానవాజు గారి నాయకత్వమునకు సైనికమర్యాద లాంచనముగా, దేశాయి గారి మృతశరీరమును ఊరేగింపుకు తీసుకొనిపోవుటకు ముందుగా జోహారులు చేసిరి. ఊరేగింపు బయలుదేరి ఒకఫర్లాంగు సాగనదో లేదో జనసమూహాము అపారముగ పెరిగిపోయెను.

## సంతాప సందేశములు.

బూలాభాయి దేశాయిగారు చనిపోయినారనేవార్త సిమ్లాలోనున్న గాంధీమహాత్మునికి తెలియగానే, గాంధీ దేశాయి కుమారుడు ధీరుబాయిదేశాయికి యీవిధంగా తంతినంపాడు. "ఇప్పుడుమనం విచారపడనవసరంలేదు. బూలాబాయి సమస్త గౌరవాలను సంపూర్ణంగా అనుభవించి కీర్తిశేషుడైనాడు. మృత్యుదేవత సుహృద్భావంతో ఆయనబాధలను పరిసమాప్తి చేసింది. మీరు ఉభయులు బూలాభాయిలోని ఉత్తమాదర్శాలను అనుసరించాలి"

మద్రాసు ప్రధాని టి. ప్రకాశంపంతులుగారిలాఅన్నారు.

"శ్రీబూలాభాయి దేశాయి మూలంగా దేశానికి తీరని లోటువర్పడింది. ఆయన గొప్పదేశాభిమాని, ఆయన ఎన్నోత్యాగాలు చేశారు. వాస్తవంగా ఆయన భారతదేశానికి పూర్ణస్వాతంత్ర్య [illegible] కష్టాలను [illegible]ారు.

కాంగ్రెసుపరీక్ష చేయుడంలో ఆయన సాటిలేని మేటిన్యాయవాది. రాజ్యాంగఅంతర్జాతీయ న్యాయశాస్త్రాలలో దిట్టఅనిపించుకొన్నాడు. ఇటీవల ఆయన బోసువీరుల విచారణలో పాల్గొన్నప్పుడే ఆయనలోనిశక్తి సామర్థ్యాలు ప్రస్ఫుటమైనవి. బోసువీరుల విచారణ ముగిసిన వెంటనే ఆయన వ్యాధిగ్రస్థుడవడం మనకు అత్యంత సంతాపకరమగుచున్నది. శ్రీదేశాయి ఎంతో ఓర్పుగలవ్యక్తి ఆయననుగురించి ఎంతతీవ్ర విమర్శనలు బయలుదేరినా కలతజెందడు. సమయం వచ్చినప్పుడు ఒకక్షణమైనా ఆగకుండా వెంటనే తగినసమాధాన మివ్వగలడు. శ్రీ ధీరుభాయిదేశాయి దంపతులకు నాసానుభూతి"

మౌలానా అజాద్

"శ్రీబూలాభాయి దేశాయి అనేకరంగాలలో పేరుప్రతిష్ఠలు సంపాదించాడు. ముఖ్యంగా ఢిల్లీఅసెంబ్లీలో కాంగ్రెసుపక్షనాయకుడుగావుండి ఆయన ప్రశంసాపాత్రంగా దేశసేవ చేశాడు. బోసువీరుల విచారణ సందర్భములో శ్రీదేశాయి చేసినకృషియే ఆయనదేశసేవలో కడపటిది. ఈకేసులో ఆయన కృషిద్వారా అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో ఒకనూతనాధ్యాయం వ్రాయబడింది"

పండిట్ నెహ్రూ

" దేశస్వాతంత్ర్యంకోసం పోరాడడానికి పరతంత్రదేశాలకుగల హక్కును సమర్థిస్తూ బోసువీరులవిచారణ సందర్భంలో

బూలాభాయిచేసిన ప్రసంగమే ఆయనకు చిరస్థాయియైన స్మారక చిహ్నంకాగలదు”

జనాబ్ జిన్నా

“రాజకీయరంగంలో దేశాయి నాతో ఏకీభవించలేదు. కాని అందుమూలంగా మాస్నేహానికి భంగపాటు కలగలేదు. ఆయనమరణంమూలంగా న్యాయవాద వృత్తికి కలిగేలోటును తీర్చడం బహుకష్టం”

నవాబ్ జాదాలియాకత్ అలీఖాన్

“రాజకీయాలలో శ్రీ దేశాయితో నేనుఏకీభవించక పోయినా, మాస్నేహంమాత్రం దృఢతరంగానేవుండేది. అసెంబ్లీలో దేశాయి ప్రసంగాలు ఎంతో శ్రోతప్రియంగా వుండేవి”

కెప్టెన్ షానవాజ్

“అజాద్ హింద్ ఫౌజు లొంగిపోగానే. మాభవిష్యత్తు అంధకార బంధురముగా కనిపించింది. మాదేశప్రజలే మాస్నేహితులే, “జపానువారి చేతులలో కీలుబొమ్మలు” గా చిత్రిస్తారని భీతిల్లాము. కానిఆసమయంలో శ్రీ దేశాయిముందుకువచ్చి నేతాజీ గౌరవాన్ని, దేశగౌరవాన్ని కాపాడినాడు. శ్రీదేశాయి భారతదేశసేవకోసమేజీవించి అందులోనే ప్రాణత్యాగంచేశాడు”

శ్రీమతి సరోజినినాయుడు

“శ్రీ బూలాభాయిదేశాయి మిక్కిలి దయాపరుడు. గొప్ప ఉదారస్వభావముకలవాడు. ఆయనచేసేదానాలు ఎవ్వరికీ

తెలియనిచ్చేవాడుకాడు. భారత దేశంపట్ల భక్తివిశ్వాసాలు కలిగివుండి, దేశస్వాతంత్ర్యం నిమిత్తం అనేకత్యాగాలుచేశాడు"

కెప్టెన్ సెఘాల్

"శ్రీ దేశాయి భారతదేశ స్వాతంత్ర్యంకోసం నిర్భయంగా పోరాడినాడు. ఇలా దేశస్వాతంత్ర్యసాధనానికై తనుఎంతో పాటుపడివున్నాడు. ఆయన జీవించివుంటే స్వతంత్రభారత దేశాభివృద్ధికి ఇంతకన్న ఎక్కువగా తోడ్పడగలిగి వుండేవాడు"

శ్రీ సి. రాజగోపాలాచారిగారు

"శ్రీ దేశాయి లాంటి కుశాగ్రబుద్ధిని, చిన్నబిడ్డవలె సుకోమల హృదయంగల వ్యక్తిని ప్రపంచంలో ఎక్కడా నేను చూచివుండలేదు. ఇటువంటి అపూర్వ గుణవిశేషాలుగలవ్యక్తిని మనం ఎన్నటికీ చూడలేము"

సర్ అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్

"శ్రీ దేశాయి, ఆయనలోని ఉత్తమగుణగణాల మూలంగా జాతిమాత వివక్షత లేకుండా భారతప్రజలకందరికీ అభిమాన పాత్రుడైనాడు. శ్రీ దేశాయి దేశస్వాతంత్ర్యంకోసం ఎంతో పరితపించాడు. అట్టిస్వాతంత్ర్యం త్వరలో లభించబోతూండగా ఆయన మృత్యువాతబడడం మిక్కిలి సంతాపకరమైనవిషయం"

కె. ఎం. మున్షి

"న్యాయవృత్తి సందర్భంలో నేను దేశాయివద్ద ప్రప్రథమం శిష్యరికంచేశాను. తరువాత ప్రజాసేవలోనేను సహచరులముగాపనిచేశాము, ఈసన్నిహిత సంబంధాన్నిబట్టి, ఈసమయం

లో ఆయన మరణించినందున ఏర్పడేలోటు ఇంతలోతీరేది కాదనే అనుకుంటున్నాను''

జె. వి. మావ్‌లంకర్

"శ్రీ బూలాభాయి దేశాయి గొప్పసామర్థ్యంగల న్యాయవాది. ఆయన తన న్యాయశాస్త్రాభిజ్ఞతను భారతదేశ యోగక్షేమాల రక్షణార్థమి త్తంమే ఉపయోగించాడు"

సర్దార్ పటేల్

"శ్రీ దేశాయి తనయావచ్ఛక్తిని లాల్‌కిల్లాలో బోసు వీరుల చరిత్రాత్మక విచారణ సందర్భంలో వినియోగించాడు. అందుమూలాన ఆయనకు అఖండఖ్యాతి చేకూరింది. కాని, ఆయన జీవితానికే ప్రమాదం వాటిల్లినది. ఆయన వివిధరంగాలలో ఒనర్చిన సేవలకు, దేశం ఆయనకు ఋణపడివున్నది''

డాక్టరు రాజేంద్రప్రసాదు

"వారంరోజులుగా దేశాయి ఆరోగ్యస్థితినిగురించి ప్రకటింపబడిన వార్తలే మాకు నిరాశకలిగించాయి. అయినాఇట్టి విషాదపరిస్థితిలో ఆయన జీవయాత్ర చాలించవలసి వచ్చిందన్న విషయంనాకు చాలాసంతాపం కలిగిస్తున్నది"

డాక్టరు లతీఫ్

"శ్రీ దేశాయి రాజకీయులలో రాజీపద్ధతుల మీాదనే ఎక్కువ అభిమానం ప్రస్తుత క్లిష్టసమయంలో భారతదేశానికి ఇట్టివ్యక్తులే ముఖ్యావసరం"

శ్రీ కె. భాష్యంగారు

"దూరదృష్టిగల గొప్ప రాజనీతిజ్ఞుని మనంపోగొట్టుకొన్నాము. శ్రీ దేశాయి మాతృభూమిసేవకు తనజీవితాన్ని అంకితంచేశాడు. దేశనాయకులకు ఆయనసలహా అత్యంతావసరమైన ఈసమయంలో ఆయన స్వర్గస్థుడవడం మనదురదృష్టమే"

శ్రీ వి. వి. గిరిగారు

"బోసువీరుల డిఫెన్సు సందర్భంలో శ్రీ దేశాయి భారతదేశానికి దేశస్వాతంత్ర్యానికి ఒనర్చినకృషి మహత్తరమైనది, రాజనీతిజ్ఞుడగు ఈన్యాయవాది ఒనర్చిన ఘనకార్యములు ప్రపంచ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడుతుంది"

సర్ సి. పి. రామస్వామిఅయ్యర్

"అనేక భారత సంస్థానాధీశులు శ్రీ బూలాభాయి దేశాయి సలహాలను కోరుతుండేవారు. ఆరోగ్యం చెడిపోయిన మీదటకూడా ఆయన బోసువీరుల విచారణలో పాల్గొనడానికి ఒప్పుకున్నాడు. విచారణ సాగుతున్న సమయంలో శ్రీదేశాయికి శ్వాసకోశంలోకి ప్రాణవాయువునెక్కించి చికిత్స చేయవలసి వచ్చింది. దీనినిబట్టి ఆయనకార్యదీక్ష ప్రస్ఫుటంకాగలదు. అదే ఆయన జీవితంలో ఒకగొప్ప విశేషం"

శ్రీ హరికృష్ణ మెహతాబ్

"ఢిల్లీలో బోసువీరుల విచారణ సందర్భంలో శ్రీ దేశాయి వాదించి శాశ్వ[illegible]న్నాడు. పారతంత్ర్య

ప్రజల విప్లవాధికారాన్ని గురించి శ్రీ దేశాయి చేసిన విశదీకరణ విప్లవకారులకందరికీ శిలాశాసనంగా వుండగలగు"

## శ్రీ గోపీనాథ్ బార్డోలాయ్

"భారత నభోమండలంనుంచి ఒకఉజ్వలతార అస్తమించింది. దేశస్వాతంత్ర్యం విషయమై వాదించిన ఒకప్రముఖ న్యాయవాదిని భారతదేశం కోల్పోయింది"

## మద్రాసులో సానుభూతి తీర్మానాలు

"శ్రీ భూలాభాయి దేశాయి మరణ సందర్భంలో పెరంబూరు వర్కుషాపులోని రైల్వేపనివారు సమావేశమై ఒక సానుభూతి తీర్మానం చేశారు"

"ప్రభుత్వ దేశీయ వైద్యశాలల హాస్పిటల్‌లో త్రిప్లికేన్ వైద్యసంఘమువారు సమావేశమై శ్రీ దేశాయి కుటుంబానికి సానుభూతి తెలియపరుస్తూ ఒకతీర్మానంచేశారు"

## పెక్కుచోట్ల హర్తాళ్

"శ్రీ భూలాభాయి దేశాయి మరణసందర్భంలో సిమ్లా, అహ్మదాబాదు, సూరత్, బొంబాయి, షిల్లాంగ్ మున్నగు పలుప్రదేశాలలో హర్తాళం జరిగింది. దుకాణాలను, విద్యాసంస్థలను, మిల్లులను ఆరోజున మూసివేశారు"

ప్రజలు, నాయకులేగాకుండా పత్రికలుకూడా
దేశాయికొరకు విలపించాయి.

ఆంధ్ర ప్రభ సంపాదకీయం,

# శ్రీ దేశాయి

అది లాల్ ఖిల్లా,

యావద్భారతదృష్టి సమస్త ప్రపంచదృష్టి ఆఖిల్లాపైనే కేంద్రీకృతమైవున్నది. దాస్యవిముక్తినికోరి, స్వాతంత్ర్యసాధనను అభిలషించి, బ్రిటనుపై యుద్ధంచేసిన ముగ్గురు అజాద్ హింద్ ఫౌజు సైనికోద్యోగులను "రాజుపై యుద్ధప్రకటన" నేరానికి సైనిక న్యాయస్థానం విచారిస్తున్నది. అది ఆ ముగ్గురు సైనికోద్యోగుల విచారణకాక, తన విచారణేఅని భావించింది. వారి పక్షాన వారి ప్రధానన్యాయవాది పలికే ప్రతిపలుకు తనపక్షాన పలకబడే పలుకేనని సన్నిహించింది. అట్టిసమయంలో ఆ సైనికన్యాయస్థానం ఆలాల్ ఖిల్లా. వాటితోపాటు యావద్భారత దేశం "సంప్రభుత్వంపై యుద్ధప్రకటన ప్రతిపరతంత్రజాతికి జన్మహక్కు" అనే మేఘగర్జనతో ప్రతిధ్వనించింది. తప్పిదంజరిగిందని నసుగుడులేదు; దోషాన్నిమన్నించవచ్చునని వేడికోలులేదు; కారుణ్యం చూపమని కాళ్ళబేరంలేదు; "వీరు రాజుపై యుద్ధంచేసినమాటనిజమే! యుద్ధంచేయుడానికి వారికి హక్కులేదనడానికి వారెవరు? ప్రతిభా విలసితమైన దేశభక్తిపూరితమైన ధీరోదాత్తపూర్వకమైన ప్రశ్నతోనాటి ఢిల్లీకోట విచారణ—నాటిసె

ఘాల్, ధిలాన్, షా నవాజ్‌ల విచారణ—ఒక పరమసత్యా అంతస్థుకు ఒక పవిత్రసూత్రం అంతస్థుకు ఎత్తివేయబడింది. ఈ విధంగా ఆనాడు లాల్ ఖిల్లాలో మేఘగర్జన చేసినవ్యక్తి శ్రీ బూలాభాయ్ దేశాయ్. ఒక మేటివక్తను, ఒకసాటిలేని న్యాయవాదిని, ఒక అకళంక దేశభక్తుని, ఒక ప్రతిభాపూర్వక రాజనితిజ్ఞుని ఈ మేఘగర్జనలో గుర్తించవచ్చు. ఆవక్త, ఆన్యాయవాది, ఆదేశభక్తుడు, ఆరాజనీతిజ్ఞుడు నేడుమనకిక లేడు.

స్థూలదృష్టితో చూస్తే శ్రీబూలాభాయ్ జీవితం సార్థకం గాంచినట్లే తోస్తుంది. సామాన్య కుటుంబంలో జన్మించి, ఆయన ఉన్నత విద్యగడించాడు. ఉపాధ్యాయ వృత్తినుంచి విరమించి, న్యాయవాదిగా ఎంతో రాణించాడు. హైకోర్టుజడ్జి పదవిని, ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్ పదవిని నిరక్ష్యంచేయగల ప్రతిపత్తిని ఆర్జించుకున్నాడు. భారతజాతీయకార్యవర్గంలో (కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలో) సభ్యుడైనాడు; ఢిల్లీ అసెంబ్లీలో ప్రతిపక్షనాయకుడైనాడు. యావద్భారతకీర్తిని గడించుకున్నాడు. ఇంతకంటె ఎవరైనా ఏమి కోరగలరని తోచడం సహజం.

కాని స్వతంత్రభారతవర్ష ప్రభుత్వంలో న్యాయశాఖామంత్రి కాదగిననన్యాయశాస్త్ర విశారదుడు, దేశభక్తి పాపం కాదని వాదించవలసిన అగత్యం కలగలేదా?

అంతర్జాతీయ సమావేశాలలో భారతదేశ వైఖరిని వివరించవలసిన మహావక్త, అధికారరహితమైన ఢిల్లీ అసెంబ్లీలో అరణ్య[illegible] పట్టలేదా?

ఏ లండనులోనో, మాస్కోలోనో, వాషింగ్టనులోనో భారతప్రజలు రాయబారిగా రాణించవలసిన రాజనీతిజ్ఞుడు, వెస్సాయి నల్లిఫి చేయగల షైనాన్సుబిల్లును తోసిపుచ్చుడిమనే వ్యర్థకార్యకలాపంతో పొద్దుపుచ్చవలసి రాలేదా?

మేధస్సు విప్పారడానికి, శక్తులు వికసించడానికి, దృక్పథం విశాలంకావడానికి, హృదయం పరిపక్వం కావడానికి, ప్రతిభ ప్రదీప్తం కావడానికి అవకాశాలు లభించనిప్రస్తుత దాస్య భారతదేశంలో—ప్రస్తుత అభాగ్య భారతావనిలో—భగ్న మనోరథాలలో కన్నుమూసిన పెక్కుమంది మహనీయులలో శ్రీ బులాభాయ్ దేశాయ్ ఒకడు.

ఆయనజీవితచరిత్ర ఆశలుఫలించని—అవకాశాలు లభించని—వ్యక్తిత్వం పూర్తిగా వికసించని—ప్రతిభ బహుముఖంగా పరిఢవిల్లని—నేటి భారతజాతి చరిత్రే ?. శ్రీభూలాభాయ్ ఆత్మకు శాంతి ప్రార్థనలవల్ల సిద్ధించబోదు; పారతంత్ర్య వినాశనంవల్లనే సిద్ధిస్తుంది.

## ఆంధ్రపత్రిక సంపాదకీయం

## ధన్య జీవి—దేశాయ్

ప్రసిద్ధ న్యాయవాది ప్రముఖ కాంగ్రెసు నాయకుడు, ప్రఖ్యాత పార్లమెంటేరియన్ భూలాభాయ్ దేశాయిగారి మరణమువలన భారత జాతీయ రంగమున ఏర్పడిన లోటు తీరనిది. వారి న్యాయశాస్త్ర పాండిత్యము, రాజ్యాంగ విషయముల వా

రికిగల పాండిత్య పరీక్ష అవసరమైయున్న ఈసమయమున వారు దివంగతులగుటవలన భారత దేశమునకు అపారనష్టము వాటిల్లి నదనుటకు సందేహములేదు. స్వాతంత్ర్యభారత దేశపు ప్రథమ ప్రధాని కాగల ప్రతిభాశాలి భూలాభాయి జీవన్జీదేశాయిగారని ప్రసిద్ధరచయిత జాన్ గంథర్ వ్రాసియుండెను. జాతీయ కాంగ్రెస్ ప్రప్రథమముగ పార్లమెంటరీ కార్యక్రమమును అనుసరించినప్పుడు దేశాయిగారు పార్లమెంటరీ కమిటీ అధ్యక్షులుగ దేశమంతట సంచారముచేసి కాంగ్రెసు తరఫున కేంద్రశాసనసభకు అభ్యర్థుల నియమించి కాంగ్రెసుకు అఖండవిజయమును చేకూర్చెను. కేంద్రశాసనసభయందు కాంగ్రెస్ పక్షనాయకులుగ నుండి, తన, తనపక్షపు ప్రతిష్ఠల నినుమడింపచేసెను. ప్రత్యర్థుల గౌరవాభిమానముల సైతము చూరగొనెను.

తన న్యాయశాస్త్ర పాండిత్యమును ధనార్జనకే గాక, జాతీయోద్యమ విజయసాధనకు ఎక్కువగ ఉపయోగించెను. 1928, 30 సంవత్సరములలో బార్డోలీ రైతులపక్షమున వాదించెను. 1945 లో భారతజాతీయ సైనికుల పక్షమునువహించి, ఇతరపనులన్నిటినీ వదలి, ఆరోగ్యమును సైతములక్ష్యపెట్టక, పనిచేసెను. ప్రథమకేసు పరిష్కారమైనప్పటినుండియు వారిఆరోగ్యము అంతతృప్తికరముగ లేకుండెను. కేసు సందర్భమున విరామ[illegible] పనిచేయుటవల్లనె వారి ఆరోగ్యము దెబ్బతినినది. నాటినుండివారు పూర్తిగ కోలుకొనేలేదు. అయితే దేశాయిగారు తమ కృషిఫలితముల ప్రత్యక్షముగ చూడకలిగిరి. అఖ

దురోజులలో ఎవరికొరకై తమ ఆరోగ్యమునుకూడ అలక్ష్యము చేసి, పనిచేసిరో ఆభారత జాతీయ సైనికులందరిపైగల కేసులను ప్రభుత్వం ఉపసంహరించుకొనినది. నిర్బంధితులవిడుదల చేసినది. భూలాభాయ్‌గారి కృషి ఫలించినది. ధన్యజీవి దేశాయ్.

యీవిధంగా బూలాభాయి దేశాయి మరణానికి చింతిల్లుచూ అనేకమంది తమసంతాపాన్ని వెలిబుచ్చారు. తెలుగు పత్రికలేగాక, ఆంగ్లపత్రికలుకూడా తమవిచారాన్ని వెలిబుచ్చుచూ పెద్దపెద్ద సంపాదకీయాలు వ్రాశాయి.

## దేశాయి ప్రతిభ.

బూలాభాయి ఒక్కన్యాయవాదిగానేగాక స్వాతంత్ర్య యోధుడుగాకూడా ఖ్యాతిగాంచగలైను. 'స్వతంత్రభారతదేశవు ప్రధమప్రధానికాగల ప్రతిభాశాలి బూలాభాయి జీవన్జీదేశాయి గారని' ప్రసిద్ధరచయిత జాన్ గంధర్ వ్రాసియుండెను.

జాతీయకాంగ్రెసు ప్రప్రధమముగా పార్లమెంటరీ కార్య క్రమమును అనుసరించినప్పుడు దేశాయిగారు పార్లమెంటరీ కమిటీ అధ్యక్షులుగా దేశమంతటా సంచారముచేసి కాంగ్రెసు తరఫున కేంద్రశాసనసభకు శాసనసభ్యులను నియమించి కాంగ్రెసుకు అఖండవిజయమును చేకూర్చెను.

## ముగింపు.

లండనులో చర్చిలు ప్రభుత్వంపోయి లేబరు ప్రభుత్వం రాగానే పార్లమెంటరీ రాయబారులుకొందరు భారతదేశము

పర్యటనముగావించి దేశదుస్థితిని చూచి, తమదేశంలో చెప్పిరి. తర్వాత లేబరుప్రభుత్వం భారతదేశ ప్రతిష్టంభనా పరిష్కా-రానికిగాను ముగ్గురుమంత్రులను భారతదేశం పంపింది. ఆ ముగ్గురుమంత్రులు భారతజాతీయ నాయకులతో సంప్రదించి తుదకు పరిష్కారప్రయత్నం గావించుటకు జిన్నా, గాంధీ, కాంగ్రెసునాయకులను సిమ్లాకు ఆహ్వానించి సంప్రదింపులు జరుపుచుండెను. సంప్రదింపులు ఆశాజనకంగానే కనిపిస్తున్నవని నాయకులంతా తలుస్తున్నసమయంలో, క్రిందటిమారు యిట్టి సిమ్లా సమావేశానికి మూలకారకుడైన బూలాభాయిదేశాయి మరణవార్త నాయకుల చెవినిబడింది. సిమ్లా సభలోనుండే ప్రతివ్యక్తికి క్రిందటి సిమ్లా సభాకార్యకలాపాలున్నూ, బూలాభాయి దేశాయిగారున్నూ, జ్ఞప్తికివచ్చారు. నిజంగా బూలాభాయి జీవాంజీదేశాయి ధన్యజీవి. ఆతనిఆత్మకు శాంతి కల్గుగాక!

సమాప్తము.

---